# తెలుగు గోష్ఠి సభ్యులు

సర్వశ్రీ

| | | |
|---|---|---|
| వసంతరావు వెంకటరావు | | డాక్టరు తిరుమల రామచంద్ర |
| చీమకుర్తి శేషగిరిరావు | ,, | పుచ్చా వాసుదేవ పరబ్రహ్మ శాస్త్రి |
| రాంభట్ల కృష్ణమూర్తి | ,, | పోణంగి శ్రీరామ అప్పారావు |
| జి. కృష్ణ | ,, | టి.వి.జి. శాస్త్రి |
| బి.ఎస్. శాస్త్రి | ,, | ముదిగొండ వీరభద్రశాస్త్రి |
| బొమ్మకంటి శ్రీనివాసాచార్య | ,, | డి.వి.ఎస్. శర్మ |
| యార్లగడ్డ ఆంజనేయులు | ,, | గుమ్మా శంకరరావు |
| బి. రామకృష్ణదాస్ | ,, | అక్కిరాజు రమాపతిరావు |
| నాగాభట్ల మార్కండేయశర్మ | ,, | పోరంకి దక్షిణామూర్తి |
| జమ్ములమడక కామేశ్వరరావు | ,, | ఘట్టమరాజు అశ్వత్థనారాయణ |
| యామిజాల జగదీశ్ | ,, | అవధానుల విజయకుమార బాబు |
| వి. నిత్యానందరావు | ,, | పగడాల చంద్రశేఖర్ |

# తెలుగులో పాళీపదాలు

( తెలుగు గోష్ఠి చర్చా సంహిత - 2 )

సంగ్రాహకుడు :
చీమకుర్తి శేషగిరిరావు

తెలుగు గోష్ఠి
రామనగర్, హైదరాబాదు - 500 048

TELUGULO PALIPADALU - An account of the Pali element in Telugu with explanatory notes, compiled on the basis of the deliberations of TELUGU GOSHTHI, an institution devoted to research in history, language and culture of Andhra Pradeeh.

తెలుగు గోష్ఠి ప్రచురణ : 2



ప్రథమ ముద్రణ : 1990

ప్రతులు : 500

**వెల : రూ. 10-00**

ప్రతులకు :
**చీమకుర్తి శేషగిరిరావు**
తెలుగు గోష్ఠి
1-9-34/4/E, రామనగర్
హైదరాబాదు - 500 048.

ముద్రణ :
**పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్**
సైదర్‌గూడ, హైదరాబాదు - 200 029

# స్వ విషయము

తెలుగు గోష్ఠికి ఇప్పటికి ఆరేండ్లు నిండినవి. తెలుగు ప్రజల సాంస్కృతిక చరిత్రలో మరుగుపడియున్న వివిధ విషయాలను వెలికి తెచ్చుటలో ఆసక్తి వహించిన ఒక మిత్ర బృందము స్థాపించిన ఈ సంస్థ ఆ ఆశయ సాధనకై యథాశక్తిగ ఈ ఆరేండ్లలో కృషిని సాగించినది. గోష్ఠిని చర్చా వేదికగ గ్రహించి పలువురు పండితులు, నెలవారీ సమావేశములలో పాల్గొని, తమ పరిశోధనల ఫలితములను వివరించిరి. వానిపై చర్చలను జరిపి గోష్ఠి తగు నిర్ణయములను కొన్నింటిని చేయగలిగినది. సాహిత్య విషయికములగు తమ రచనలను కొన్నింటిని కొందరు సభ్యులు గోష్ఠియందు వినిపించిరి. వీని యన్నింటికిని ముద్రణలో రూపమును కల్పింపవలెననియే గోష్ఠి ఆకాంక్షించు చున్నది; కాని వనరుల లేమి ఒక అడ్డంకిగ నిలిచినది.

తెలుగు గోష్ఠిలోని తొలుతటి రెండేండ్ల చర్చలలో కొన్నింటిని, కొందరు వ్యక్తుల, సంస్థల సాహాయ్యముతో 1986న 'తెలుగు మలుగులు' అను పేరుతో 'తెలుగు గోష్ఠి చర్చా సంహిత I' గ గోష్ఠి తెలుగున ముద్రింపజేసినది; దాని ఆంగ్లానువాదము 'Forgotten Aspects of Telugu' అను పేరున ఆ సమయముననే ప్రచురితమైనది అవి పండితుల దృష్టిని బాగుగ ఆకర్షింప గలిగినవి.

గత ఆరేండ్లలో జరిగిన తక్కిన చర్చల వివరములను, చదువబడిన చారిత్రక సాంస్కృతిక, సాహిత్య విషయిక వ్యాసములను - తగు వనరులను సేకరించి - ముద్రింపజేయుటకై గోష్ఠి కృషి చేయుచున్నది. ఆ కృషిలో ఒక ఫలితమే ఈ 'తెలుగులో పాళీ పదాలు.'

తెలుగు గోష్ఠి సంస్థాపక బృందమున ఒకడుగ, గోష్ఠి కార్యకలాపముల నిర్వహణలో అత్యంత శ్రద్ధ వహించుచున్న మిత్రుడు శ్రీ యార్లగడ్డ ఆంజనేయులు ఈ గ్రంథ ప్రచురణకై తగు ధన సాహాయ్యము చేసెను.

తెలుగు గోష్ఠి సాగించుచున్న సాంస్కృతిక కృషికి సాయపడు సంకల్పముతో విద్వన్మిత్రుడు, పద్మావతీ ప్రింటర్స్ అధినేత శ్రీ పి. శ్రీనివాస్ తగు ఉదారతతో ముద్రణను చాల చక్కగ నిర్వహించెను.

తెలుగు గోష్ఠి సమావేశములకై ప్రతి మాసమున నెలవొసగి, సౌకర్యము లను సమకూర్చి, ప్రోత్సాహమును కల్పించి సాయపడుచున్నది తెలుగు విశ్వవిద్యాలయము.

—పై అందరకును తెలుగు గోష్ఠి సదా కృతజ్ఞతతో ముడివడియున్నది.

హైదరాబాదు
12-5-1990

**సంచాలకుడు**
'తెలుగు గోష్ఠి'

# సంకేత వివరణ పట్టిక

## 1. భాషా సంకేతములు

**పా.** పాళీ; **తె.** తెలుగు; **సం.** సంస్కృతము

## 2. ఆంధ్ర గ్రంథ సంకేతములు

| వరుస సంఖ్య | సంకేతము | గ్రంథ నామము | గ్రంథకర్త |
|---|---|---|---|
| 1. | అచలా. | అతలాత్మజా పరిణయము | వెంకటాచార్యకవి |
| 2. | అచ్చ. రా. | అచ్చతెలుగు రామాయణము | కూచిమంచి తిమ్మకవి |
| 3. | ఆం. భా. | ఆంధ్రభాషార్ణవము | నుదురుపాటి వెంకనార్యుడు |
| 4. | ఆం.సం. | ఆంధ్రనామసంగ్రహము | పైడిపాటి లక్ష్మణకవి |
| 5. | ఆము. | ఆముక్తమాల్యద | కృష్ణదేవరాయలు |
| 6. | ఉ.రా. | ఉత్తర రామాయణము | కంకంటి పాపరాజు |
| 7. | ఉ.హ. | ఉత్తర హరివంశము | నాచన సోమన |
| 8. | కాశీ. | కాశీఖండము | శ్రీనాథుడు |
| 9. | కువల. | కువలయాశ్వచరిత్రము | సవరము చిననారాయణకవి |
| 10. | కృ.శకుం. | శకుంతలా పరిణయము | కృష్ణకవి |
| 11. | చెన్న. | చెన్నబసవపురాణము | అత్తనూరి పాపకవి |
| 12. | జై.భా. | జైమిని భారతము | పిల్లలమఱ్ఱి పినవీరనకవి |
| 13. | ద్వి.సా.చ | ద్విపదసారంగధరచరిత్రము | బాణాల శంభుదాసుడు |
| 14. | ద్వి.హరిశ్చ, | ద్విపదహరిశ్చంద్రచరిత్రము | గౌరన |

| వరుస సంఖ్య | సంకేతము | గ్రంథ నామము | గ్రంథకర్త |
|---|---|---|---|
| 15. | నిర్వ. | నిర్వచనోత్తరరామాయణము | తిక్కన సోమయాజి |
| 16. | నీలా. | నీలాసుందరీపరిణయము | కూచిమంచి తిమ్మకవి |
| 17. | నైష. | శృంగార నైషధము | శ్రీనాథుడు |
| 18. | పండితా. | పండితారాధ్య చరిత్రము | పాలకురికి సోమన |
| 19. | పాండు. | పాండురంగమాహాత్మ్యము | తెనాలి రామకృష్ణుడు |
| 20. | పారి. | పారిజాతాపహరణము | నంది తిమ్మన |
| 21. | ప్రబంధ. | ప్రబంధరాజ వేంకటేశ్వర విలాసము | గణపవరపు వెంకటకవి |
| 22. | ప్రభులిం. | ప్రభులింగలీల | పిడుపర్తి సోమయ |
| 23. | బస.పు. | బసవపురాణము | పాలకురికి సోమన |
| 24. | భాగ. | భాగవతము | బమ్మెర పోతరాజు |
| 25. | భార. | భారతము | కవిత్రయము |
| 26. | భా.రా. | భాస్కర రామాయణము | భాస్కరాదులు |
| 27. | భా.శ. | భాస్కర శతకము | మారద వెంకయ్య |
| 28. | భీమ. | భీమేశ్వర పురాణము | శ్రీనాథుడు |
| 29. | భోగినీ. | భోగినీ దండకము | బమ్మెర పోతరాజు |
| 30. | మనుచ | మను చరిత్రము | అల్లసాని పెద్దన |
| 31. | యయా | యయాతి చరిత్రము | పొన్నగంటి తెలగన్న |
| 32 | రం.రా | రంగనాథ రామాయణము | గోన గన్నారెడ్డి |
| 33. | రసి. | రసిక జన మనోభిరామము | కూచిమంచి తిమ్మకవి |
| 34. | రామ. | రామరాజీయము | వెంకయ్య |
| 35. | రామా. | రామాభ్యుదయము | అయ్యలరాజు రామభద్రుడు |
| 36. | రా వి. | రాజవాహన విజయము | కాకుమాని మూర్తికవి |

| వరుస సంఖ్య | సంకేతము | గ్రంథ నామము | గ్రంథకర్త |
|---|---|---|---|
| 37. | వరాహ. | వరాహ పురాణము | మల్లయ సింగనలు |
| 38. | వా.రా. | వాసిష్ఠ రామాయణము | మడికి సింగన |
| 39. | విక్ర. | విక్రమార్క చరిత్రము | జక్కన |
| 40. | విజ.వి | విజయ విలాసము | చేమకూర వెంకటకవి |
| 41. | వీధి. | వీథి నాటకము | శ్రీనాథుడు |
| 42. | వేణు. | వేణుగోపాల శతకము | |
| 43. | వేమన. | వేమన శతకము | |
| 44. | శివరా. | శివరాత్రి మాహాత్మ్యము | శ్రీనాధుడు |
| 45. | సమీర. | సమీరకుమార విజయము | పుష్పగిరి తిమ్మన |
| 46. | సాం.ని. | సాంబ నిఘంటువు | కస్తూరి రంగకవి |
| 47. | సానందో. | సానందో పాఖ్యానము | శివరామకవి |
| 48. | సారంగ. | సారంగధర చరిత్రము | చేమకూర వెంకటకవి |
| 49. | సు.శ. | సుమతి శతకము | బద్దెన |
| 50. | సూ.రా.ని. | సూర్యరాయాంధ్ర నిఘంటువు | |
| 51. | హంస. | హంసవింశతి | అయ్యలరాజు నారాయణ కవి |
| 52. | హర. | హర విలాసము | శ్రీనాధుడు |
| 53. | హరి పూ. | హరివంశ పూర్వ భాగము | ఎఱ్ఱాప్రెగ్గడ |
| 54. | హరి.ఉ. | హరివంశ ఉత్తర భాగము | ఎఱ్ఱాప్రెగ్గడ |

# 3. పాళీ గ్రంథ సంకేతములు

| వరుస సంఖ్య | గ్రంథ సంకేతము * | గ్రంథనామము |
|---|---|---|
| 1. | అంగు. | అంగుత్తర నికాయ |
| 2. | ఉ | ఉదాన |
| 3. | ఖు | ఖుద్దక పాఠ |
| 4. | చు. ని. | చుల్ల నిద్దేస |
| 5. | జా. | జాతకమాల |
| 6. | థేర. | థేరగాథా |
| 7. | థేరీ. | థేరీగాథా |
| 8. | దివ్యా. | దివ్యావదాన |
| 9. | దీఘ | దీఘనికాయ |
| 10. | ధమ్మ. | ధమ్మపద |
| 11. | ధ. సం. | ధమ్మ సంగణి |
| 12. | పంచ. | పంచగీతి దీపన |
| 13. | పే.వ. | పేత వత్థు |
| 14. | మ. | మజ్ఝిమ నికాయ |
| 15. | మహా. | మహావంస |
| 16. | మిళి. | మిళిందపఞ్హా |
| 17. | విన. | వినయపిటక |
| 18. | విభం. | విభంగ |
| 19. | విమా. | విమానవత్థు |
| 20. | విసు. | విసుద్ధిమగ్గ |
| 21. | సంయు. | సంయుత్తనికాయ |
| 22. | సద్ధ. | సద్ధమ్మోపాయన |
| 23. | సుత్త. | సుత్తనిపాత |

* సంకేతము వెంబడి వ్యా. అనునది ఉన్న యెడల ఆ గ్రంథపు వ్యాఖ్యయని గ్రహించవలెను,

# తెలుగులో పాళీపదాలు

## వస్తు పరిచయము

తెలుగుదేశమున ప్రాకృత భాషలు దాదాపు యెనిమిదివందల సంవత్సరములు - క్రీ. పూ. 4 వ శ. మొదలుగ క్రీ. శ. 4 వ శ. వరకు - వర్ధిల్లినవి, ఆనాటి రాజులు ఆ భాషలను ఆదరించి, పోషించి తమ శాసనములను వానిలోనే వెలయించిరి. ఆ కాలమున ఆంధ్రదేశమున విపుల వ్యాప్తిని, ప్రజాదరణను ఆర్జించిన బౌద్ధమతపు ప్రామాణిక గ్రంథములును 'పాళీ' అను ఒక విధపు ప్రాకృతముననే యుండుటవలన, లౌకిక ధార్మిక రంగముల రెండింట ఆ ప్రాకృతములు ప్రాముఖ్యమును ఆర్జించి దేశపు భాషపై విస్తృతమగు ప్రభావమును నెరపి యుండుట సహజము.

ప్రాచీన యుగమున తెలుగుదేశములోని ప్రజానీకమున మాతృభాషగ ఒక ఆర్యేతర భాష ఉండినటుల సాతవాహన ప్రభువులలో ఒకడగు వాసిష్ఠీపుత్ర పులుమావి యొక్క నాణెమువలన సుస్పష్టము (చూ. తెలుగు మలుగులు పు. 84); కాని ఆ భాషను ఆ కాలమున ఏ పేరుతో వ్యవహరించిరో మనకు తెలియదు. ఆ నాణెమందలి 'కు' అను విభక్తి ప్రత్యయమువలనను, 'మాక' ఇత్యాదిపదముల వలనను అది నేటి తెలుగుభాషకు తొలిరూపముగ సంభావించదగి యున్నది. ఆ దేశభాషపై అప్పటికే ప్రాకృతభాష తన పలుకుబడిని వ్యాపింప జేసిన దనుటకు, పైన పేర్కొనబడిన నాణెముపై నున్న 'దేశి' వ్రాతలోని 'అరహణ' ఒక నిదర్శనము. ఈ విధముగ ప్రాకృతముల ప్రభావమునకు లోనైన దేశభాషను బౌద్ధులు తమ మత ప్రచారమునకు వినియోగించుచు దానిని, 'అంధక' భాష, అని వ్యవహరించిరి. తెలుగుదేశమును బౌద్ధులు ఆ కాలమున 'అంధక'మని వ్యవహరించుటవలన ఆ భాషకు 'అంధక భాష' అని వారు పేరిడియుందురు. పాళీ భాషలో ఉన్న పిటక గ్రంథములను, తనకు పూర్వులగు వారలు కొందరు అంధక, దమిళ భాషలలోనికి అనువదించిరనియు, అవి

మౌలిక గ్రంథములందలి విషయములను చక్కగ అనువదింపలేదనియు బుద్ధఘోషుడు (క్రీ. శ. 4 వ శతాబ్ది) 'పపంచ సూదని' అను తన వ్యాఖ్యా గ్రంథమున తెలియజేసెను. ఈ అంధక భాషయందలి సాహిత్యము మతధర్మ ప్రచారమునకు మాత్రమే ఉద్దిష్టమైయుండును. అందువలననే ఆ కాలపు రాజులలో పలువురు సాంప్రదాయికముగా వచ్చు ప్రాకృత భాషలలోనే తమ శాసనములను వ్రాయించిరి. కొందరు క్రీ.శ. రెండవ శతాబ్దికి తరువాత ఎడనెడ సంస్కృతమును ఆదరించిరి.

ఇది ఇటులుండ క్రీ.శ. ఆరవ శతాబ్ది అంతమునను, ఏడవ శతాబ్ది ఆరంభమునను చెలరేగిన ఒక మతవిప్లవము వలన ఆంధ్ర దేశమున బౌద్ధము నామావశిష్టమైనది; శైవము చాలవరకు బౌద్ధపు స్థానమును ఆక్రమించి రాజాదరణను ఆర్జించినది; ఎడనెడ జైనమును పలుకుబడిని ఆర్జించినది. బౌద్ధ మతముతోపాటుగ ఆ మతప్రచారమునకే వినియుక్తమైన అంధక సాహిత్యము కూడ అదృశ్యమైనది.

ఇచట ఒక విషయము. ఒక సాహిత్యము, దానిని అదరించువారు లేక, అంతరించినను అది జాతికి ఇచ్చిన పదజాలము, నుడికారము అంతరింపవు. ఏదియో ఒక తీరున అవి ఆ జాతికి చెందిన తరువాతి సాహిత్యమున స్థానమును ఆర్జింపగలవు. అందువలన ఏడవ శతాబ్ది మొదలుగ ఆ అంధక భాషను ఆలంబనముగగొని ఒక సాహిత్యము - అది శైవ సాహిత్యము కానిండు, జైన సాహిత్యము కానిండు - తప్పక రూపుగొనియుండును; కాని పదవ శతాబ్ది మొదలుగ వైదిక స్మార్త సంప్రదాయమునకు బలము కలుగుటవలన, ఆదరము లేక ఆ సాహిత్యము సైతము అంతరించియుండును. ఆ కాలమునకు చెందిన కొన్ని శాసనములు - రేనాటి చోళుల శాసనములు, తూర్పు చాళుక్యుల శాసనములు, జినగంగాధరుని శాసనమున కొలది భాగము - మాత్రమే ఆనాడు ఆంధ్ర భాషలో ఒక విధమగు సాహిత్యము కలదనుటకు లక్ష్యములుగ నిలిచి యున్నవి. ఆ కాలముననే - క్రీ. శ 10 వ శతాబ్దిలో - రూపొందినది కవిజనాశ్రయమనియు, దానిని రచించినవాడు మల్లియ రేచన యను జైనుడనియు, లక్ష్య గ్రంథములు లేకుండ లక్షణ గ్రంథములు రూపుగొనవు కావున అప్పటికే ఆంధ్రమున దేశభాషాసాహిత్యము వ్యాప్తిలో ఉండెననియు, డా. పుచ్చా వాసుదేవ

పరబ్రహ్మ శాస్త్రి సహేతుకముగ ఒక వ్యాసమున తెలియజేసెను (చూ: తెలుగు మఱుగులు పు. 58). దానిని బలపరచుటకు ఆధారములును కలవు. నన్నయ, తన ఆంధ్ర మహాభారతమున వాడిన కవ్వడి, వడముడి మొదలగు భారత వీరుల నామములను అతడు కల్పించి యుండడు కదా! భారత కథకు సంబంధించిన తత్పూర్వపు సాహిత్యమునుండి వచ్చినవే అవి కాదగును; కలకంఠుడు మొదలగు నవియు అట్టివియే. నన్నయ తనకు పూర్వపు 'దేశి' సాహిత్యమున వాడుకలో ఉన్నవానినే ఇటుల పనిగొనెను.

నన్నయ మొదలగు తెలుగుకవులకు సంస్కృతముపై ఆదరణ ప్రబలినది; తత్ఫలితముగ, పూర్వపు సాహిత్యపు కొన్ని పదములు వారి సాహిత్యమున స్థానములను ఆర్జింపలేకపోయినవి; అయినను ప్రజల సామాన్య భాషలో అవి చాల వరకు నిలిచినవి; కొన్ని రాజుల శాసనములలో తలదాచుకొన్నవి; కొన్ని అంతరించియే యుండును; అటుల పరివర్తన చెందుటలో 'అంధక' భాష 'ఆంధ్ర భాష' యైనది.

ఆంధ్రము-తెలుగు పదములు సమానార్థకములుగ ఎప్పటి నుండి వాడుకలోనికి వచ్చినవనుట ఇచ్చట చర్చనీయము కాదు. క్రీ. శ. 11 వ శతాబ్ది నాటికే ఆ రెండును సమానార్థకములైనవి. తెలుగు భాషపై ప్రాకృతముల ప్రభావము కలదనుటను కేతన (14 వ శతాబ్ది) మొదలుగ ఆంధ్రకవులును గుర్తించి తెలియజేసిరి; కాని భాషలోని పదములను వింగడించి వాని వ్యుత్పత్తులను నిర్ణయించుటకు సరియగు కృషి ఆ కాలమున జరుగలేదు. ఆధునిక యుగమున సూర్యరాయాంధ్ర నిఘంటు సంకలనకర్తలు ఈ కృషిని సాగించిరి; కాని అది దోషభూయిష్ఠము; వారి కాలమునకే ద్రావిడభాషా వాదము పండితలోకమును ఆవహించుటవలన తెలియనిదెల్ల ద్రావిడభాషా జన్యమవియే తెలిపి వారు సంతృప్తి చెందిరి; కొన్ని చోటుల కప్పదాటువేసి బయటపడిరి. (చూ : ఇనప ఎడ్లు; పన్నస మొ.)

ఇక ఆంధ్ర భాషా చరిత్రలు ఈ నడుమ ఎన్నియో వెలువడినవి; అవియన్నియు ద్రావిడ భాషా వాదమును పట్టుకొని వ్రేలాడినవేగాని, దేశభాషపై ప్రాకృతముల ప్రభావము మూలమున వచ్చిన మార్పులను గమనించినవే కావు;

దాదాపు 800 ఏండ్లు దేశమున విపులవ్యాప్తితో మని దేశభాషకు సాహిత్యరూపమును సంతరించిన ప్రాకృతముల ప్రసక్తి ఆ గ్రంథములలో తగినట్లుగ కన్పట్టదు.

యథార్థమున భాషా పరిణామమును గుర్తించుటకు పదముల వ్యుత్పత్తి రీతుల పరిశీలనను చారిత్రక దృష్టితో జరుపవలెను; ఆ విధముగ ఆ పరిణామమును అర్థము చేసికొనినపుడే ఒక భాషాచరిత్రను విశిష్టరీతిలో రచించ వలను పడును. దేశచరిత్రతో సంబంధము లేకుండ భాషాచరిత్రను రచింపబూనుట నేలవిడిచి సాముచేయుట వంటిదే. కాల్డ్ వెల్ మొదలుగ ఇప్పటివరకు జరిగిన తెలుగు భాషాచరిత్ర కృషి ఈ కోవకు చెందినదే. ఈ విషయమును గ్రహించిన తెలుగు గోష్ఠి, తెలుగు భాషపై ప్రాకృతముల ప్రభావమును గుర్తించుటకై కృషి జరుగుట అత్యావశ్యకమని భావించినది.

'పాళీ' ప్రాకృతములలో ఒకటి మాత్రమే; కాని 'పాళీ' అనునది నిజముగ భాషా నామమే కాదు. 'పాళీ' అనుదానికి పాళీభాషలో 'ధర్మానుశాసనమ్' అనియే అర్థము. బౌద్ధమత గ్రంథములగు పిటకములకు సమష్టిగ 'పిటకపాళి' అను వ్యవహారము దక్షిణ భారతమున తొలుత ఏర్పడినది. అందువలన అందలి భాషకు 'పాళీ' అను పేరు కలిగి, క్రమముగ బౌద్ధమత ధర్మగ్రంథములన్నింటి భాషకు ఆపేరే దక్షిణ భారతమున రూఢమైనది. ఆ గ్రంథములందలి భాషను పండితులు 'మూల మాగధి' అనెడు వారని బుద్ధఘోషుడు వ్రాసెను. అది 'మూల మాగధి' అనుటను కొందరు పండితులు సరికాదన్నను, అది ఒక రకపు 'మాగధి'అనుటలో సందియములేదు. ఇక ఆనాటి ఆంధ్రదేశమున, ఉత్తర భారతమునుండి వచ్చిన జైనులవలన అర్ధమాగధియు, ఇతరుల వలన పైశాచి, మహారాష్ట్రి మొదలగునవియు చొరబారినవి; అందువలన పాళీతో సంబంధములేని ప్రాకృత పదములును అనేకములు తెలుగున స్థానములను ఆర్జించినవి. 'ద్వీప' మునకు పర్యాయపదములుగ తెలుగున కన్పట్టు దివి, దీవి పదములు ఇట్టివియే; పాళీలో 'దీప'అను పదమే అందులకు సమానార్థకముగ కలదు. కావున ఆంధ్రభాషా స్వరూపమును చక్కగ గ్రహించుటకు ప్రాకృత భాషల అన్నింటి సమగ్రపరిశీలన అత్యంతావశ్యకము. దానిని ఒక్క పెట్టున నిర్వహించుటకు విస్తృత సాధన సామగ్రియు తగు వనరులును ఉండవలెను. అట్టివి గోష్ఠికి లేవు; కావున పాళీభాషా పదములవరకే తన కృషిని తెలుగు గోష్ఠి పర్యాప్తము చేసికొనినది. ఆ కృషి

8-6-86న జరిగిన సమావేశమున మొదలై ఎడనెడ పలు సమావేశములలో సాగిన చర్చల వలన రూప పరిణతిని పొందినది; తత్ఫలితమే అనుబద్ధమగు పద పట్టిక.

ఈ పట్టిక సమగ్రము కాదు. ఇందులకు కొన్ని కారణములు కలవు: తెలుగు వ్యాకర్తలును, నైఘంటికులును 'తత్సమములు' అని వ్యవహరించు వానిలో ఋ,ౠ,ఌ,ౡ,ః, శ,ష-లు కలవి తప్ప-తక్కినవి దాదాపుగ అన్నియు పాళీ యందును కలవు. (ఋ,ౠ, మొదలగు పై అక్షరములు పాళీలో లేనందున అవి యున్న తత్సమములు మాత్రము పాళీలోనికి రాకుండినవి.) ఇటుల పాళీలో ఉన్న బహుళ తత్సమ సామగ్రి 800 ఏండ్ల చిరపరిచితి వలన - సంస్కృతము దేశమున కాలిడక పూర్వమే-తెలుగున చేరియుండును. కాని పాళీ నుంచి వచ్చిన ఆ తత్సమములకు పట్టికలో స్థానమును కల్పించుట ఆవశ్యకము కాదని గోష్ఠి భావించినది. చారిత్రక ప్రాముఖ్యమును బట్టియు, అర్థ విభేదమును బట్టియు అయిదారు తత్సమ పదములు మాత్రమే పట్టికలోనికి రాగలిగినవి.

ఇక తెలుగులోనికి పాళీనుండి వచ్చినటుల స్పష్టముగ తెలియనైనను, తెలుగు నిఘంటుకర్తలు సరియగు అర్థములను గ్రహింపక అపార్థములను కల్పించిన కొన్ని పదములను, ఈ పట్టికలో చేర్చక వేరుగ చర్చింపదగునని గోష్ఠి భావించినది. ఇట్టి వానికి గణనీయ లక్ష్యముగ పేర్కొనదగినది 'తణ్హా'. బుద్ధదేవుడు ప్రవచించిన నాలుగు ఆర్యసత్యములలో రెండవ దానియందు ఆ పదము కననగును. 'తణ్హా' అనగ తృష్ణ. పాళీలోని 'తణ్హా' తెలుగున 'తనివి'గ పరిణమించినది. దీనిని గుర్తించక సూ.రా.ని. 'తనియు' అను ధాతువుతో దీనిని ముడిపెట్టి 'తనివి' యన తృప్తి అను అర్థమును కల్పించినది. 'తనివో వగ' అను శృంగార నైషధ ప్రయోగము (5-9)నకు 'తృప్తిపోవుట' యన ఎటుల సరికుదురునో వారాలోచించినటులలేదు. ఒక పదము రెండు విధములగు ధాతువులనుండి నిష్పన్నమగుట కలదనియు, అట్టి యెడ రెండర్థములను కలిగి యుండుననియు వారు గుర్తింపక కలగలుపు చేసిరి. ఇట్టి పదములను వేరుగ చర్చించదగునని గోష్ఠి నిర్ణయించినది. ఇట్టి కొన్ని అవధులకు లోబడి తయారయిన ఈ అనుబద్ధ పట్టిక అసమగ్రమని అనక తప్పదు.

ఈ అసమగ్ర పట్టికలో 239 పాళీ పదములును, వానినుండి రూపొందిన తెలుగు పదములును ఈయబడినవి. ఈ పదములను స్థాలీపులాక న్యాయమున

పరికించినను, తెలుగువారి జీవితపు వివిధ రంగములందు అవి ఎట్టి కీలక స్థానములను కలిగియున్నవో అనుట సుస్పష్టమగును. పై కోవకు చెంది నవియే: రక్తసంబంధమును తెలియజేయు అమ్మ, అయ్య; సర్వనామములగు అతను, తను, తన, తాను; సంఖ్యావాచకములగు ఉద్ద, దుగ, చక్క; వ్యావసాయిక రంగమునకు చెందిన అంకె, అచ్చుకట్టు, ఓదె, కంచె, కుని, కళ్ళము, నాగేలి, కాడి, కావడి, పల్లము, వంక; ఆహార రంగమునకు చెందిన కంచము, తట్ట, మల్ల, అంబళి, గంజి, కారము, కజ్జకాయ, తాంబూలము, పోక; వేష ధారణకు వర్తించు బట్ట, ధోవతి, చీర, పయ్యెద, చెఱగు; వృత్తిని సూచించు వడ్రంగి, కమ్మరి; పరికరములగు కత్తెర, కొడవలి, గుద్దలి, గొడ్డలి; పలుగు; ఆర్థిక రంగమునకు వర్తించు లంచము, వడ్డి, సంచకరము, సంబళము, సుంకము; ప్రత్యయములగు ఒద్ది, పొంత; క్రియాపదములగు అద్దు, అరికట్టు, ఆదుకొను, అసించు, ఉగ్గడించు, ఉజ్జగించు, ఉడుకు, ఎదుగు, ఒడ్డు, ఓకరించు, ఒడియు, ఓసరిల్లు, ఓహటించు, కొట్టు, తీర్చు, నిక్క, పరిమార్చు, పగులు, ప్రోచు, బుజ్జగించు, బొక్క, విఱుగు, వేధించు. ఇట్టి పదాలు ఆంధ్రభాషా సౌధమునకు దిటవగు పునాదిని ఏర్పరచుటలో ప్రముఖపాత్ర వహించినవి కావని ఎవరన గలరు? ఈ విధముగ పాళీభాష తెలుగుపై నెరపిన ప్రభావమును ఇంకను పరిశోధింపవలసి యున్నదనియు, అట్టిదానికి ఈ పట్టిక దోహదకారి కాగల దనియు గోష్ఠి ఆసించుచున్నది.

అనుబద్ధమగు పట్టికలో తొలుత పాళీపదమును దాని కెదురుగ తత్సన్నిహితమగు తెలుగు పదమును ఈయబడినవి. అంతట పాళీ పదమునకు పాళీ గ్రంథములందు కననగు అర్థమును, అట్టి ప్రయోగము కాననగు గ్రంథపు నామ సంకేతాదులును, కొన్ని యెడల పదవ్యుత్పత్తి వివరములును తెలుపబడినవి. రైస్ డేవిడ్స్ మొదలగువారు కూర్చిన పాళీ నిఘంటువులనుండి ఈ విషయములు గ్రహింపబడినవి. వారిచ్చిన వ్యుత్పత్తులు సరియైనవి కావని గోష్ఠి భావించినపుడు అందులకు కారణములను తెలిపి సరియైన వ్యుత్పత్తిని రూపొందించుటకు యత్నించినది. పాళీపదమునకు సన్నిహితమగు తెలుగుపదపు ప్రయోగములు సాధ్యమైనంతవరకు పూర్వ గ్రంథములనుండియు, అటుల గ్రంథస్థములు కాని వాని విషయమున వ్యావహారిక భాషనుండియు ఈయబడినవి పాళీలోని పదములు చాలవరకు యథారూపముననే తెలుగులోనికి చొచ్చినవి; కొలది పదములు మాత్రమే వర్ణాగమ, వర్ణవ్యత్యయ, వర్ణలోపములకు లోనైనవి.

# తెలుగులో పాళీపదాలు

## పద పట్టిక

1. పా. అంస (అంసి) తె. అంచు

'అంస' పదమునకు 'అంచు' అను అర్థమును పాళీనిఘంటువులు ఇచ్చినవి. 'అంసి' దాని పర్యాయరూపము; చతురంస = నాలుగంచులు కలది (ధ. సం. 617). సంస్కృతమున ఇట్టి అర్థము 'అంస'కు లేదు; అందు 'అంచల' ఇట్టి అర్థముననే ఉన్నది; కాని దానికి సరియగు వ్యుత్పత్తి కన్పట్టదు. బహుశః పాళీలోని 'అంస'యే సంస్కృతములోనికి చొరబారి 'అంచల'గ రూప వికృతి పొందియుండును.

తెలుగున 'అంచు'నకు 'కొన, కడబద్దె'—అను అర్థములే కలవు; ఆ రీతిగ ప్రయోగములును ఉన్నవి. 'యవసం బంచుల నాడఁగా నెగసె వాత్యాళిన్ రజశ్చక్రముల్' (అము.2-48). 'గిన్నెయంచు' మొదలగునవి వ్యవహార సిద్ధములు.

2. పా. అక్కోస. తె అక్కసు (అక్కసము)

'అక్కోస'కు పాళీలో తిట్టుట, అవమానించుట–అను అర్థములు కలవు (మిళి.8). తెలుగున ఈ భావమే కొంత విస్తృతిని గ్రహింపగ 'అక్కసు' (అక్కసము) అనుదానికి 'కోపము' అను అర్థము కలిగినది.

3. పా. అక్ఖర తె అక్కరము

'అక్ఖర' అను పాళీపదము సం. లోని 'అక్షర' మునకు సమానార్థకముగ (ధ్వని సంకేతముగ) వాడుకలో కలదు. తెలుగునను 'అక్కరము' ఆ అర్థమునే సూచించును.

4. పా. అక్ఖాన తె. వక్కాణము

'అక్ఖాన'మునకు పాళీయందు 'కథనము, వల్లెవేయుట, ఆఖ్యానము'-అను అర్థములు కలవు; ప్రయోగములును కలవు (దీఘ. 1.6). తెలుగున 'వక్కాణము' 'అక్ఖాన'కు వికృతియే. కాని సూ.రా.ని. 'వక్కాణము'ను 'వ్యాఖ్యాన' పదపు తద్భవముగ తెలిపి పొరపడినది. ఆఖ్యాన, వ్యాఖ్యాన పదములు విభిన్నార్థకములు.

5. పా. అగరు తె. అగడు

'అగరు'కు పాళీలో 'అగౌరవ, ఆవిధేయ' - అనునవి అర్థములు (దీఘ. 1.89). తెలుగున ఈ అర్థములకు కొంత విస్తృతి లభించగ, 'అగడు'నకు 'నీచపు, హీనపు' అను అర్థములు ఏర్పడినవి. 'అగడు మనికిఁ దలఛి' (ప్రబంధ - 743).

6. పా. అగ్గల తె. అగ్గలము

'అగ్గల'కు పాళీలో 'అడ్డు గడియ', 'వేసికొనిన దుస్తులు చెదరిపోకుండ పైన సంధించిన వస్త్ర ఖండము' - అను అర్థములు కన్పట్టును (విన. 1-290; జా. 1-8). 'అడ్డు గడియ' గాని 'సంధించిన వస్త్ర ఖండము' గాని తమకు సంబంధించిన వానికి పైననే ఉండుట వలన 'అగ్గలము' అను తెలుగు పదమునకు 'మించి యుండుట' అను భావమున 'అధికము, మించినది' - అను అర్థములు కలిగినవి. 'ఆత్మ రక్షకు నగ్గలంబు ధర్మ రక్షయ' (భార. ఆది. 6-220).

7. పా. అగ్గి తె. అగ్గి

'అగ్గి' అనునది తెలుగులోనికి పాళీ నుండియే చొరబారినది; **సం.** లోని 'అగ్ని' నుండి వికృతిగ అది వచ్చి యుండదు.

8. పా. అగ్ఘ తె. అగ్గించు

అగ్ఘకు పా. లో 'విలువ' అని అర్థము, ఈ విశేష్యమునే క్రియారూపమున 'అగ్ఘతి' అని వాడినపుడు 'విలువకట్టుట' అను అర్థము కలిగినటుల ప్రయోగములు ఉన్నవి (జా. 6. 174.).

'విలుక కట్టుట'యే క్రమముగ 'పొగడుట' అను అర్థమును ఆర్జించుట వలన తెలుగున 'అగ్గించు'టకు 'పొగడు' అను భావమున ప్రయోగము కలిగినది. 'అరుల గుణములైన నగ్గింతురెప్పుడు' (భార. విరా. 4-223.)

9. పా. అఙ్క — తె. అంకె

పాళిలో 'అఙ్క'కు 'కొంకి' అను అర్థము కలదు. ఇదియే విస్తృతార్థమున ఒక వస్తువును వేరొక వస్తువు అంటి పెట్టుకొని యుండునటుల జేయు సాధనము, లేదా పన్నకము - అను భావమున ప్రయోగమును కలదు (జా. 5-322).

తెలుగున 'అంకె'కు ఇదే అర్థము కలదు. సామాన్య ప్రజలలో వ్యవసాయమున ఈ పదమునకు ఎక్కువ ప్రచారము ఉన్నది. కాడి క్రిందకు ఎద్దును తెచ్చిన తరువాత ఆ కాడిని ఎద్దుమెడతో సంధించునది 'అంకె'. ఒక్కొకపుడు ఎద్దు పెడదారికి లాగి కాడినుండి వెలుపలికి వచ్చినపుడు, మెడకు ఈ 'అంకె' త్రాడు తగులుకొనియే యుండును; అపుడు ఆ ఎద్దును 'అంకె వేసికొన్నది' అనుట పరిపాటి. ఇట్టి 'అంకె' విస్తృతార్థమును గ్రహించుటవలన 'అంకెకు వచ్చుట' అనగా 'వశపడుట' అను భావము ఏర్పడినది. 'అంగన నమ్మరాదు తన యంకెకు రాని మహాబలాఢ్య వేభంగుల మాయలాడ్డి' (భా. శ. 2).

10. పా. అచ్చి — తె. అచ్చి

'అచ్చి' యన పా. లో 'కాంతికిరణము' (సం. అర్చి) అని అర్థము. తెలుగున ఈ అర్థము విస్తృతిని ఆర్జించగ, 'జీవితమున చీకటిపోయి వెలుగు వచ్చుట'గ పరిణమించినది. అందువలన 'అచ్చి వచ్చుట'యన 'మేలు కలుగుట' అను అర్థము ఏర్పడినది. లోకవ్యవహారమున మాత్రమే 'అచ్చి వచ్చుట' కననగుచున్నది.

11. పా. అచ్చిబంధ — తె. అచ్చుకట్టు

'అచ్చిబంధ' యన పాళిలో 'నలుచదరపు పరిమడుల ఏర్పాటు'(విన.1287) అని అర్థము. తెలుగున 'అచ్చుకట్టు' నకును వ్యవసాయ రంగమున ఇట్టి అర్థమే

కలదు. వరిపొలములకే కాక తక్కిన తోటసాగు పొలములందును ఈ పదపు వాడుక కననగుచున్నది. పాళీపదమగు 'అచ్చి'తో 'కట్టు' అను దేశిపదము సమసించగ ఏర్పడిన మిశ్రసమాసమిది. తెలుగున నిలిచిన 'కఱకంఠ' మొదల గునవి ఇట్టివే. వ్యవసాయమున వాడుకలో ఉండు ఈ పదము క్రమముగ 'చక్కగ విభజించు' అను అర్థమును కూడ ఆర్జించినది. 'దీవు లేర్పరచి భువనంబు లచ్చుకట్టి' (హరి.ఉ. 9.158).

12. పా. అచ్ఛేర / అచ్ఛరియ — తె. అచ్చెరువు / అచ్చెరియము

పాళీలో 'అచ్ఛరియ, అచ్ఛేర' - అను రెండును సమానార్థకములు. 'ఆశ్చర్యము' అనియే వానిలో ప్రతిదానికి అర్థము (మిళి. 28). తెలుగున అవి 'అచ్చెరియము, అచ్చెరువు' అను రూపములను పొంది 'ఆశ్చర్యము' అను అర్థముననే వాడబడుచున్నవి; 'గెలిచికోలిది యచ్చెరియంబు మన్మథా' (కృ.శకుం. 2.179); 'అచ్చటి బంధులు నీవును నచ్చెరువడి వినుచునుండ' (భార.ఉద్యో 311).

13. పా. అఞ్ఞ — తె. అన్నెము

పాళీలో 'అఞ్ఞ' యన 'జ్ఞానము, పరిజ్ఞానము' అను అర్థములు కన్పట్టును (మ. 1.445). తెలుగున 'అన్నెము' అనుదానికిని ఈ అర్థములే సరికుదురును. 'అన్నెము పున్నెము దేవుడె యెఱుంగు' (సారంగ. 3.82) అను సందర్భమున 'అన్నెము'నకు 'అన్యాయము' అను అర్థమును కల్పించి సూ.రా.ని పొరపడినది.

14. పా. అట్టక — తె. అటుక / అట్టక

'ఎత్తుగ స్తంభములపై కట్టబడిన ఒక విధపు మంచె' అని పా. లోని 'అట్టక'కు అర్థము (విన. 1-178). తెలుగున 'అటుక (అట్టక)' పదము సరిగా ఆ అర్థముననే గాకపోయినను, 'వస్తువులుంచుటకు ఇంటిలోపల గోడల మీద అడ్డముగ కొయ్యలు లోనగువానిచే నేర్పరచిన మంచె' అను అర్థమును కలిగి యున్నది. ఈ రీతిగ భావసాన్నిహిత్యము తెలుగు, పాళీపదముల మధ్య చక్కగ కన్పట్టును. 'అటుక' పదమును సం. లోని 'అట్టః'కు వికృతిగ సూ.రా.ని. గ్రహించి పొరపడినది.

15. పా. అత్తన్ తె. } తాను, తన, అతడు (ను)

'అత్తన్' అను పాళీ పదము సం. లోని 'ఆత్మనః' పదపు వికృతి (సంయు. 4 307). ఇది తెలుగున 'తాను' అని ప్రథమా విభక్తి రూపమును, 'తన' అను షష్ఠీ విభక్తి రూపమును ఆర్జించి నిలిచినది. 'అతను' అను రూపము కూడ లోక వ్యవహారమున కననగుచున్నది. దీనికే 'డు' ప్రత్యయమును చేర్చి 'అతఁడు' అను రూపమును వ్యాకర్తలు సాధించిరి. సూ.రా.ని. 'అతఁడు' అను దానికి 'అతఁడు' అని అర్థమును ఇచ్చినదేగాని వ్యుత్పత్తిని గురించి ఆలోచించ లేదు. ఈ అతను, తను, తాను పదములు ద్రావిడ భాషా పదములు కానేరవు.

16. పా. అద్ద తె. అద్దు

'అద్ద' అను పాళీపదమునకు 'తడిచేయుట' 'చెమ్మగిలఁజేయుట' అను అర్థములు కలవు (మిళి. 346); తెలుగున కావ్యములందును వ్యవహారము నందును ఇట్టి అర్థమే 'అద్దు'కు కన్పట్టుచున్నది. 'నీట నద్దుము, పాల నద్దుము' (బస.పు. 5-161). 'అద్దుడు కాగితము' అని వ్యవహారముననుకలదు.

17. పా. అనుగ తె. అనుఁగు

'అనుగ' అను పాళీపదమునకు 'వెంబడించు, ప్రభావమునకు లోనై వర్తించు' అను అర్థములు కన్పట్టును (సుత్త. 332). ఈ పదమే 'అనుఁగు'గ తెలుగున గ్రహింపబడి యుండును 'అనుఁగు' పదపు అర్థమును దానినే ఋజువు చేయుచున్నది. 'నరుఁడనుఁగుబంటు గావున' (భార. ద్రోణ. 5.26). సంస్కృత మున 'అనుగ' శబ్దము ఈ అర్థముననే ఉన్నను పాళీయందున్నంత విరివిగ దానికి అచట వాడుకలేదు. కావున పాళీనుండియే తెలుగులోనికి ఈ పదము ప్రవే శించి, ఉచ్చారణలో అంత్యాక్షరమునకు పూర్వమున అర్ధానుస్వారమును గ్రహించియుండును.

18. పా. అబ్బోహారిక (అబ్బోహారిక) తె. ఎబ్బెటికము

'అబ్బోహారిక'యన పాళీలో 'లోకాచార విరుద్ధపు, గర్హణీయమగు' అను అర్థములు కలవు (జా.3-309) తెలుగున 'ఎబ్బెటికము'నకును 'రోతపని' అను

అర్థము కలదు. విశేషణరూపమున ఉన్న పాళీపదము తెలుగున విశేష్యముగ గ్రహింపబడినది. 'యెబ్బెఱికము లేక యేలుచునున్నాఁడు చెఱకు విల్కానికిఁ జిక్కినాఁడు' (ఉ. రా. 6-200). తెలుగువారి ఉచ్చారణలో మూలపదములోని 'రేఫ', శకటరేఫగ మారియుండును.

19. పా. అమ్బిలయాగు తె. అంబలి

'అమ్బిలయాగు' అనగా పాళీలో 'పులియబెట్టిన గంజి' అని అర్థము (ధమ్మ. వ్యా. 2-85). క్రమముగ వాడుకలో చివరి పదము వదలివేయబడగా, తొలుతటి పదము 'అంబలి' అను రూపమున అదే అర్థమున తెలుగున నిలిచినది. ఆ అర్థమేగాక, 'ఎక్కువ ద్రవముతో తయారయిన పిండి పదార్థము' అను అర్థమునను తెలుగున కావ్యములందు ప్రయోగములు కలవు. 'పలుచని యంబళుల్ చెఱకు పాలెడసీళ్ళు' (ఆము. 1-8) సూ. రా. ని. దీని వ్యుత్పత్తిని గమనించినది కాదు.

20. పా. అమ్మ తె. అమ్మ

'అమ్మ' అన పాళీలో 'తల్లి' యని అర్థము. తల్లినే గాక ఏ ఇతర స్త్రీనైనను గౌరవముతో పిలుచుటకును ఈ పదము ఆ భాషలో వాడుకయందున్నది (పే. వ. వ్యా. 63) తెలుగున కూడ లోక వ్యవహారమునను, కావ్యములందును ఈ అర్థములందే ప్రయోగములు విరివిగ కలవు. మరియొక విశేషము కలదు: తల్లిదండ్రులను పిలిచెడు పదములను ఏ భాషయందైనను ప్రాతిపదిక పదములుగ భావింతురు. తక్కిన దక్షిణ భారతీయ భాషలలో 'తల్లి'ని 'తాయి' ఇత్యాది పదములచే వ్యవహరించుట పరిపాటిగ నుండగ, తెలుగున 'అమ్మ' అను పాళీ పదముననే ఆ వ్యవహరణ జరుగుట తెలుగునకు పాళీతో నున్న సన్నిహిత సంబంధమును రుజువొనర్చుచున్నది.

21. పా. అయ్య తె. అయ్య

'అయ్య' పాళీలో గౌరవ వాచకముగ మాత్రమే ప్రయుక్తమైనటుల నిఘంటువుల వలన తెలియుచున్నది (జా. 3-167); లోక వ్యవహారమున ఆ భాష యందది 'తండ్రి'ని సూచించెనని భావించుటకు అవకాశమున్నది. 'అయ్యక'

అను పాళీ పదము 'తాత'ను తెలియజేయును ఇక తెలుగున గౌరవవాచకముగ మాత్రమేగాక 'తండ్రి' యనుటకు 'అయ్య' వాడబడుచున్నది. ఇదియు 'అమ్మ' వలె భాషలోని ప్రాతిపదిక పదమే.

22. పా. అలగ్గ తె. అలగా

'అలగ్గ' యన 'ఎచటను కుదురుకొనని' అను అర్థము పాళీలో కలదు (చు.ని. 107). తెలుగున లోకవ్యవహారమున కన్పట్టు 'అలగా జనము' అను దానిలో 'అలగా'కు ఈ అర్థమే సరికుదురుచున్నది.

23. పా. అల్లిక తె. అల్లిక

పాళీలో 'అల్లిక' యన ఒకదానితో ఒకటి పెనవేసికొనిన ఏర్పాటు (విన.110). తెలుగున అల్లికయు ఇట్టిదే. ఇంతేకాదు; పాళీలో 'అల్లీయతి' అను క్రియారూపమును కన్పట్టుచున్నది (జా. 1.273). 'అల్లుకొను' అను తెలుగు క్రియ ఇట్టిదియే.

24. పా. ఆగు తె. ఆగము

'ఆగు' పదమునకు పాళీలో 'దుశ్చర్య' అని యర్థము (చు ని. 337). తెలుగున 'ఆగము చేయుట' అను వ్యావహారిక ప్రయోగమున 'ఆగము'నకును ఈ అర్థమే సరికుదురును. సూ.రా.ని. ఈ 'ఆగము'ను వదలివేసి, 'ఆగడము'ను మాత్రమే ఇచ్చి, దాని వ్యుత్పత్తికై సం. లోని 'ఆగస్' అనుదానిని సూచించినది సం.లోని ఆ పదమునకు కావ్యములందు ప్రయోగములు అరుదు. అందువలన అది పాళీలోని 'ఆగు' నుండియే వచ్చియుండును. లోకవ్యవహారమున 'చేయు' నుండి 'చేయడము' రూపొందినటులనే,'ఆగు' నుండి 'అగడము' వచ్చియుండును.

25. పా. ఆణత్తి తె. ఆనతి

పాళీలో 'ఆణత్తి' యన ఉత్తరువు, ఆజ్ఞ (సద్ద, 59.354). తెలుగున 'ఆనతి' కి ఇట్టి అర్థమే కలదు. 'దేవరయానతియు అస్మదీయ నియమమున్' (విక్ర 1. 154). సం. లో 'ఆజ్ఞప్తి'కి ఇట్టి అర్థమే ఉన్నను, దానికి ఆ భాషలోనే ఆ అర్థమున వాడుక చాల తక్కువ. తెలుగు కావ్యములందు ఎచటను ఆ పదము ఆ అర్థమున ప్రయోగింపబడినటుల కన్పట్టదు. తెలుగు శాసనములందు 'ఆజ్ఞప్తి'

అను పదము ఒక విధపు అధికారిని మాత్రమే తెలుపుచున్నది. కావున తెలుగున 'ఆనతి' ఆ అర్థముననే పాళీలోని 'అణతి' నుండియే రూపొందియుండును; 'ఉపాయమెయ్యదియొ మాకానతిమ్మన' (భార ఆర. 8.3)

26. పా. ఆదా తె. ఆదా

'ఆదాయము'నకు పర్యాయ పదముగ 'ఆదా' అనునది పాళీలో మాత్రమే కన్పట్టుచున్నది (విన. 4-120). **సం.** న అట్టిదిలేదు. తెలుగున 'ఆదా' అను దానికిని ఆ అర్థమే కలదు

27. పా. ఆదేతి తె. అదుకొను

'ఆదేతి' యన సంతోషమును కలిగించు, తన రక్షణ లోనికి తీసికొను. అను అర్థములు కలవు (సుత్త. 121; జా. 3. 110). తెలుగున 'అదుకొను' పదమును ఇట్టిదియే. 'అన్య మెఱుంగ నన్నాదుకొను మనుచు' (ద్వి. శ. సా. 2-56-12)

28. పా. ఆరకత్థ తె. అరికట్టు

'ఆరకత్థ' అను పాళీపదమునకు 'అడ్డగించి దూరమున ఉంచుట' అని యర్థము (ధమ్మ. వ్యా 4. 228). తెలుగున 'అరికట్టు' పదమునకు ఇదియే అర్థము. 'తెరువుల నరుగంగ నరికట్టి చంపె నాబాల వృద్ధంబుగా బహుజనముల' (నిర్వ. 3. 78). ఈ పదమును సూ.రా.ని. తమిళము నందలి 'అరి' అను పదమునుండి సాధింప యత్నించినది.

29. పా. ఆస తె. ఆస

'ఆశ' అను **సం.** పదమునకు పర్యాయపదముగ పాళీలో 'ఆస' ప్రయుక్తము (విన. 1. 255) తెలుగునను ఇది ఈ రూపముననే కలదు. అంతేకాదు; పాళీలోనే క్రియారూపమున 'ఆసంసతి'గ ఇది మార్పొందినది (చూ: దిగువ పదము)

30. పా. ఆసంసతి తె. ఆసించు

'ఆస' అను విశేష్యమునకు క్రియారూపమే 'ఆసంసతి' అను పాళీపదము. 'ఆసించుట' అని దీని అర్థము. తెలుగున 'ఆసించు'ను ఇట్టిదియే.

31. పా. ఇంఘాల తె. ఇంగలము

పాళీలో 'ఇంఘాల' యన నిప్పు (థేరీ. 386). సం. లోని 'అంగార' పదపు తద్భవమని నిఘంటుకారుని అభిప్రాయము. తెలుగున ఈ పదమే 'ఇంగలము'గ మారొ్పందినది. లోకవ్యవహారముననే గాక కావ్యములందును అ అర్థమున విరివిగ ప్రయోగములు కలవు

32. పా. ఇక్కాస తె. వెక్కసము

'చెట్లనుండి వచ్చు బంక' అను అర్థమున 'ఇక్కాస' అను పాళీపదము గ్రంథములందు ప్రయుక్తము (విన. 2 51). బుద్ధఘోషుడు ఈ పదపు నిజ రూపము 'నిక్కాస' అని భావించెను. రూపము ఎట్టిదైనను 'లోపల నిండుగ నుండి వెలుపలికి వచ్చునది' అను భావార్థమున ఈ పదము 'వెక్కసము' అను రూపమును తెలుగున పొందినది. 'అక్కటగండడై యప్పటప్పటికి వెక్కసంబున నూర్పు వేలు నప్పిచ్చె' (ద్వి. హరిశ్చ. ఉ. 473 ప.)

33. పా. ఇట్ఠక తె. ఇటుక

'ఇట్ఠక' అనగా పాళీలో 'ఇటుక రాయి'. కాల్చినదానికే ఈ పదము ప్రయుక్తమైనటుల సుస్పష్టము (విన. 2-121). ఈ పదమే తెలుగున 'ఇటుక'గా పరిణమించినది. సం లోని 'ఇష్టక'నుండి కన్నను, పాళీలోని 'ఇట్ఠక' నుండియే 'ఇటుక' రూపొందినదన్నది సముచితము.

34. పా. ఇత్థి తె. ఇంతి

'ఇత్థి' అన పాళీలో 'స్త్రీ' అని అర్థము తెలుగున 'ఇంతి'యు అట్టిదియే.

35. పా. ఇస్స తె. ఈసు

**సం.** లోని 'ఈర్ష్యా' పదమునకు సమానార్థకము **పా.** లోని 'ఇస్స' (మ. 1.15). 'ఈసు' అను రూపమున, అదే అర్ధమున తెలుగులో ఇది చేరినది; 'ఈసునఁబుట్టి డెందమున హెచ్చిన శోకదవానలంబుచే గాసిలి యేడ్చె' (పారి. 1.133).

36. పా. ఈసక తె. ఇంచుక

'ఈసక' అనగా 'కొంలదిగ' అని అర్థము. (జా. 1-77) తెలుగు నందలి 'ఇంచుక' దీనినుండి రూపొంది ఆ అర్థముననే ప్రయుక్తము. 'ఇంచుక యేని పాపమున కెన్నఁడు రోయక' (భార. ఆది. 6-294). సూ. రా. ని. 'ఇంచుక'ను **సం** లోని 'కించిత్' యొక్క తద్భవముగ భావించుట ఏ విధము గను సమర్థనీయము కాదు.

37. పా. ఉక్కా తె. ఉక్క

పాళీ, తెలుగు భాషలందు రెండింట 'ఉక్క' పదము ఒకేరీతిగ 'ఊష్మము, సెగ' అను అర్థముల ప్రయుక్తము. 'మిక్కుటంబుగ మేని యుక్కచేఁ గమలిన' (రాజ. చ. 3.140). 'ఉక్కబోయుట' అనునది లోకవ్యవహార సిద్ధము.

38. పా. ఉగ్గహ తె. ఉగ్గడించు

'ఉగ్గహ' అను పాళీపదమునకు 'చదువుట, గ్రహించుట' అని అర్థములు కలవు (విసు. 96). తెలుగున సరిగా ఈ యర్థమున గాకపోయినను 'తెలుపుట, పేర్కొనుట' అను యర్థములను, తత్సన్నిహిత భావములను కలిగియున్నది. 'ఉగ్గడింపనొల్ల కూరక యెఱుగని యదియ పోలెనుండె' (భార. ఉద్యో. 4.374).

39. పా. ఉచ్ఛిన్దతి తె. వ్రచ్చు

పాళీ 'ఉచ్ఛిన్దతి' అనుదానికి 'విరుగగొట్టుట, చీల్చుట' అను అర్థములు కలవు (సంయు. 5.432). తెలుగున 'వ్రచ్చు'నకు ఇట్టి అర్థములే సరిపడును. 'మైమఱువు వ్రచ్చి, శరంబులు మేన గ్రుచ్చి' (భార. భీష్మ. 1.136). సూ. రా. ని. 'వ్రచ్చు'ను **సం.** లోని 'వ్రశ్చ్'తో ముడివెట్టుట అర్థరహితము.

40 పా. ఉజ్ఝతి తె. ఉజ్జగించు

పాళీలోని 'ఉజ్ఝతి'కి 'విడిచివేయుట' యని అర్థము (జా. 6.138). 'ఉజ్జగించు' అను తెలుగు పదమునకును అర్థము అదియే. 'ఆజ్ఞ పాటించి, మది వెఱ యుజ్జగించి' (భార. శల్య. 1.320).

41. పా. ఉద్ధ తె. ఉద్ద

'ఉద్ధ' అనునది పాళీలో 'నాలుగు' అను సంఖ్యావాచకమును తెలియజేయును (మహా. 7.53). **సం.** లోని 'చతుర్థ' పదమునుండి ఈ 'ఉద్ధ'ను సాధించుటకై 'రైస్ డేవిడ్స్' పండితుడు యత్నించెను. 'చతుర్థ' పదము తొలుత 'చదుత్థ'గా వికృతిపొంది, అందున్న చివరి 'ఉత్థ' పదము వర్ణలోపాదులవలన 'ఉద్ధ'గ మార్పొందెనని ఆ పండితుని అభిప్రాయము. కాని ఆది అసమంజసము. 'చతుర్థ' పదమునకు 'నాలుగవ' అనియే **సం.** న అర్థము. 'నాలుగు' అనుటకు ఆ భాషలోని పదము 'చత్వారి'. ఇక ఆయన సూచించిన వర్ణలోపాదులు ఊహించుటకైనను వీలుపడనివి.

ఇక 'ఉద్ధ'కు వ్యుత్పత్తి ఎట్టిది? సామాన్యజనులందు సంఖ్యావాచకములకు పర్యాయరూపములను-వీలుపడినపుడు-శరీరాంగములతో సూచించుట పరిపాటి. 'అయిదు'నకు బదులుగ 'చేయి' అని తెలుగువారనుట ఇట్టిదియే. వ్యావసాయిక సంఘమున పశువులతో గాఢ పరిచితి కలిగినవారు పశువుయొక్క పొదుగు (ఊధ)ను, - దానికి నాలుగు చన్నులుండుట వలన - 'నాలుగు'నకు పర్యాయ రూపముగ వాడియుందురు. అదియే పాళీలో 'ఉద్ధ'గ నిలిచియుండును. మూడున్నర అనుటకు పాళీలో 'అద్ధ ఉద్ధ' అనెదరు (జా. 5-417). ఆ భాషయందలి ప్రయోగరీతిని బట్టి 'అర తక్కువ నాలుగు' అని దాని భావము.

తెలుగున 'ఉద్ద'గ పైపదము మార్పొంది ఆ అర్థమునే కలిగియున్నది. 'చౌ యుద్ద తీవంచ చౌకము నలు, నాలుగనగ, జతుర్నామముల్......' (సాం ని. 29) నాలుగు వస్తువుల ప్రోగులుగ వస్తువులను అమర్చుటను 'ఉద్దలు పెట్టుట' అని ఆంధ్రప్రదేశ్‌లోని కొన్ని ప్రాంతములవారు వ్యవహరింతురు

42. పా. ఉణ్ణి తె. ఉన్ని

సం.లోని 'ఔర్ణి' (గొఱ్ఱెబొచ్చుకు సంబంధించినది) అనుదానికి సమానార్థకమైన పాళీపదము 'ఉణ్ణి'. దానితో నేయబడిన వస్త్రమునకును ఆ భాషలో ఆ పదమునే వాడెదరు (విన. 2-108). తెలుగున 'ఉన్ని' అను రీతిగ ఆ పదము వాడుకలోనికి వచ్చినది. పాళీలోవలెనే 'గొఱ్ఱెబొచ్చు'ను అది తెలియజేయుచున్నను, దానితో నేయబడిన వస్త్రమును తెలియజేయుటలేదు.

43. పా. ఉద్దియ  తె. ఒడ్డె

'ఉద్దియకు' పాళీలో 'ఉత్తర దిశకు చెందిన' అని అర్థము. (జా. 4. 352) తెలుగున దీనికిగాని, దీని 'వికృతి' యన దగిన దేనికిగాని కావ్యములందు గాని, వ్యవహారమునగాని ప్రయోగము లేదనుట యథార్థమే. కాని, చారిత్రకముగ ఈ పదమునకు ఒక ప్రాముఖ్యము కలదు. తెలుగువారు కళింగ రాజ్యమును 'ఒడ్డె రాజ్యము' అనుటయు 'కళింగరాజు'లను 'ఒడ్డెరాజులు' అనుటయు పరిపాటి. పాళీ భాష తెలుగు దేశమున వ్యాప్తియందున్న దీర్ఘకాలమున తెలుగు దేశమున ఉత్తర భాగమున ఉన్న 'కళింగము' 'ఉద్దియ' అని వ్యవరింపబడుటవలన, అదియే క్రమముగ 'ఒడ్డె'గ దేశభాషలో పరిణమించినది. అది మరల సంస్కృత మున చొరబారి 'ఓడ్ర'మైనది. బౌద్ధుల గ్రంథములందు కొన్నింట ఆంధ్ర దేశ మున ఒకభాగమును 'ఒడ్యాణ' మని వ్యవహరించినటుల ఐతిహాసికులకు ద్యోతక మైనది. దీనిని గురించి కొంత చర్చయు జరిగినది. [ఆంధ్రదేశమునకు ఒడ్యాణ మను పేరు ఉన్నదా. భారతి. మా. 63 (2)]. 'ఒరిస్సా' అనునది తొలుత 'ఒడి విస'గా వ్యవహృతము. ఇది 'ఒడ్డె విషయ' అనుదానికి సన్నిహితము. తొలుతటి రూపము 'ఉద్దియ విషయ' అయియై యుండును.

45. పా. ఉద్దేహక  తె. ఉడుకు

'ఉద్దేహక' అను పాళీపదమునకు 'బుడగలు వచ్చునటుల ద్రవమును మఱగ బెట్టుట' (జా. 3. 46). అని అర్ధము. తెలుగున ఈ పదము, ఆ అర్ధముతోనే, 'ఉడుకు'గ మారినది. 'కళ పెళ నుడుకు చక్కని నూనియలు' (నీలా. 3.34). అన్నము ఉడుకుట మొ. వ్యవహార సిద్ధములు.

45. పా. ఉద్ధార  తె. ఉద్దర

'ఉద్ధార' అను పాళీ పదానికి 'ఋణము' అని అర్థము (జా. 2. 341); తెలుగున వాడుకలో 'ఉద్దర'కు 'ఋణము' అను అర్థమే - ముఖ్యముగ తెలంగా ణమున - వ్యాప్తిలో ఉన్నది. కాని తాకట్టు, కుదువ అను అర్థములు గ్రంథము లందు ఈయబడినవి.' 'తాకట్టు. కుదువ యుద్ధర, వారకంబీడనంగను నాధి చెల గుచుండు' (ఆం.భా. 2-229) బహుశః మాండలిక భేదముల వలన ఈ అర్థ భేదము ఏర్పడియుండును. **సం.** న 'ఉద్ధార' పదమునకు 'ఋణము' అను అర్థము ఉన్నను దానికి పాళీలో ఉన్నంతగ వ్యాప్తిలేదు.

46. పా. ఏత్తావతా తె. ఏతావతా (ఏతావాతా)

పాళీలో 'ఏత్తావతా' అన 'ఇప్పటికి అయినంతవరకు పరికించగా' అని అర్థము (మిళి. 14). తెలుగున లోక వ్యవహారమునందు మాత్రమే అది 'ఏతా వాతా' అను రూపమున-పాళీలోని అర్థమున-ప్రయుక్తము. సం.న 'ఏతావత్' అను పదము దాదాపుగ ఈ అర్థముననే ఉన్నను, సమానమున పూర్వపదము గనే అది ప్రయుక్తము. పాళీలో మాత్రమే వ్యస్తముగ ప్రయోగము లభ్యము; తెలుగునను ఆ విధముగనే వాడుకలో ఉన్నది.

47. పా ఏధతి తె. ఎదుగు

'ఏధతి'అను పాళీపదమునకు 'పెరుగుట' అనిఅర్థము (జా.1.123).తెలుగు న 'ఎదుగు' ఈ అర్థముననే ప్రయుక్తము. 'గర్వమెదుగంగ నా దశకంధ రుండు' (నిర్వ. 4-22.)

48. పా. ఓకిరణతి (ఓకిలిణతి) తె. ఓకరించు

పాళీపదమగు 'ఓకిరణ'కు 'వెలికిత్రోయు' అని అర్థము (విన. 3-107). తెలుగున 'ఓకరించు' ఆ అర్థముననే ప్రయుక్తము. 'ఓకిరించు' అను రూపము కూడ లోకవ్యవహారమున కలదు, 'ఓకిలించు' కూడి ఆ అర్థముననే వ్యాప్తి యందున్నది; 'పెట్టకుమని యోకిలించు' (భా. రా. యు. 2-216).

49. పా. ఓడ్డేతి తె. ఒడ్డు

'ఓడ్డేతి' అను పాళీక్రియా పదమునకు 'వలవేయుట'యని అర్థము (జా. 2-37). తెలుగున ఆ అర్థముననే 'ఒడ్డు' విరివిగ వాడుకలో కలదు. 'ఉరులొడ్డి వేకువ వచ్చి యొక్క మాలఁడు' (భార. శాంతి. 3-20). 'పందెమున నొడ్డుట' ఇత్యాది విస్తృతార్థములు కాలక్రమమున ఈ పదమునకు తెలుగున కలిగినవి

50 పా. ఓడ్డా తె. ఒడియు

'ఓడ్డా అను పాళీపదమునకు 'బలము చూపి గ్రహించు' అని అర్థము (విసు. 180). తెలుగున 'ఒడియు'నకును ఇదియే అర్థము; 'వాని ముందల నొడిచి తిగిచి' (జై. భా. 3-113)

51. పా. ఓదహన త. ఓదెవేయు

పాళీ పదమగు 'ఓదహన'కు 'కుప్పవేయుట' అని అర్థము (ధమ్మ. వ్యా. 8-118)

తెనుగున 'ఓదెవేయుట' యన 'కోతకోసిన పంటగడ్డిని చిన్నకుప్పగ పడవేయుట' అను ప్రత్యేకార్థము లోక వ్యవహారమున కలిగినది. కావ్యము లందు మౌలికమగు పాళీపదపు అర్ధముననే ఆ పదము ప్రయుక్తము 'ఇరు గెలకుల గపులుం దనశరముల నోదెలు వడంగ' (భా రా.యు. 8-166.)

52. పా. ఓధి తె. ఒద్ది (ఒద్ద)

'ఓధి' అను పాళీపదమునకు 'అవధిగ, పర్యంతమున, దగ్గర' అను అర్థములు కలవు (ధమ్మ. వ్యా. 2-80). తెలుగున విభక్తి ప్రత్యయమగు 'ఒద్ది'కి ఆ అర్థములే కలవు. భారతమున 'ఒద్ది' అను రూపమే కన్పట్టుచున్నది. 'ఒక్కపుణ్యాశ్రమంబున నొద్ది యేట విడిసి' (భార. ఉద్యో. 3-146). 'ఒద్ద' అనునది దాని పర్యాయ రూపము. తెనుగున విభక్తిప్రత్యయ రూపనిష్పత్తిలో 'పాళీ' వహించిన పాత్రను ఈ పదము స్పష్టము చేయుచున్నది.

53. పా. ఓర తె. ఓర

'ఓర' అను పాళీ పదమునకు 'దగ్గర దిగువన' అను అర్థము కలదు (విమా.వ్యా : 42). తెలుగున 'ఓర చూపు' అనుదానిలో 'ఓరకు' ఈ అర్థమే సరికడరుచున్నది; 'ఓరచూపుల విటచిత్తమూగులాడ' (పీఠి. 50). 'ఓర' కు క్రమముగ 'ప్రక్కకు' అను అర్థము ఏర్పడి పెక్కు తెలుగు సమాసములును క్రియాపదములును అందుండి రూపొందినవి.

54. పా. ఓరత తె. ఊఱట

'ఓరత' అను పాళీపదమునకు 'తృప్తిచెందిన' అను అర్థము కలదు (మిళి. 210). తెలుగున 'ఊఱట' విశేష్యరూపమున వాడుకయందున్నను దాదాపుగా పై అర్థమునే కలిగియున్నది. 'ఉనికియు నూఱటయును' (భార. విరా. 2-315). తెలుగువారి ఉచ్చారణలో మూలపదమునందలి 'రేఫ' 'శకట రేఫ'గ కాలక్రమమున మార్పొందియుండును.

**55.** పా. ఓసరణ

'ఓసరణ' అను పాళీపదమునకు ప్రక్కకు పోవుట అను అర్థము. (సుత్త. 538). 'ఓసరిలు'కు తెలుగున అర్థమును అదియే; 'ఓసరిల పఱచు మృగములు' (భార. ఆది. 4-13)

**56.** పా. ఓహరణ తె. ఓహటించు

'ఓహరణ' అను పాళీపదమునకు 'ప్రక్కకును దిగువకును లాగు' అను అర్థము కలదు (జా. 6.525) తెలుగున 'ఓహటించు' అన 'ఓడుట, వెనుదీయుట' అనునవి సూ.రా.ని, ఇచ్చిన అర్థములు. ఇవి పాళీపదపు అర్థమునకు సన్నిహితములే. అంతేకాదు. భారతమున ప్రయోగము పాళీలోని మూలపదపు అర్థమునకు చక్కగ సరికుదురుచున్నది. 'ఆహవమునందు నీవోహటించిపోవ' (భార. స్త్రీ. 2 38). ఇక తెలుగునందలి 'ఓడు' (పరాజయమొందు) అనుదానికి 'ఓహటించు'తో సంబంధము ఏదియైన కలదా? యనుట విచారింపదగు విషయము.

ఇంకొక విషయము. తెలుగున 'ఓహరి సాహరి' అను పదప్రయోగము కలదు. దీనికి సూ రా.ని. 'అహమహమికతో పోరాడు, ఎడతెగక పోరాడు, గుంపులు వట్టి పోరాడు' అను అర్థములను ఇచ్చినది. వ్యుత్పత్తిని విచారించినది కాదు. పాళీలో 'ఓహరణ'తోపాటుగ 'సారణ' అను పదము కలదు. దానికి 'ముందునకు పోవుట' అని అర్థము. అపుడు 'ఓహరణ సారణ' అనగ 'వెనుకకు ముందుకు పోవుచుండుట' యను అర్థము కలుగుచున్నది. ఇదియే తెలుగువారి నోట వర్ణలోప, వర్ణాగమములకులోనై 'ఓహరి సాహరి' అని మార్పొంది యుండును. ఈ పదము యుద్ధ వర్ణనలందే తెలుగున ప్రయుక్తము. 'ఒకపుడు వెనుకకుపోయినను, మరల ముందునకు వచ్చుచు' చేయు పోరాటమునకు ఇది చక్కగ వర్తించును. సూ.రా.ని. వివిధార్థములను ఇచ్చి, చూపిన ప్రయోగములు అన్నింటికి ఈ అర్థము బాగుగ సరికుదురును.

**57.** పా. కంస తె. కంచు, కంచము

'కంస' అను పదము పాళీలో ఒక ప్రత్యేక లోహమును తెలియజేయుచున్నది (మిళి. 2); అంతేకాదు; ఆ లోహముతో చేయబడిన పాత్రను ఆ

పదమే వినియుక్తము (జా. 1.336). ఆ 'కంస' నుండి రూపొందినదే తెలుగున 'కంచు'. 'కంచరయంగ భస్మమున శుద్ధమైన విధమునన్' (భార. శాంతి. 1-314). ఈ పదము తెనుగున ఆ లోహమునకు మాత్రమే పరిమితమై, దానితో రూపొందిన పాత్రకు 'కంచము' అను పేరు వేరుగ గలిగినది. 'ఘనగతశంపఁ గంచమిడి' (ఆము. 2-16). సం. నను 'కాంస్య' పదము ఆ లోహమును తన్నిర్మిత పాత్రను తెలియజేయుచున్నదనుట యథార్థమే; కాని తెలుగువారికి సం. తో పరిచయము ఏర్పడుటకు పూర్వమే (క్రీ. శ. 1వ శతాబ్ది నాటికే) ఆ లోహముతో పరిచితి కలిగినటుల సుస్పష్టము. కావున పాళీ నుండియే 'కంచు' తెలుగున చొరబారి యుండును.

ఇంకొక విషయము. 'కాంస్య' పదపు వ్యుత్పత్తిని సంస్కృత వ్యాకర్తలు సాధింప వలనుపడక వదలివేసిరి. బేబిలోనియన్ భాషా పదమది యనియు, ఆ నామమును బేబిలోనియనుల నుండి భారత దేశీయులు గ్రహించిరనియు రైస్ డేవిడ్స్ అభిప్రాయము. ఇది ఇంకను శోధించవలసిన విషయము. ఇది నిజమగునెడల లోకవ్యవహారమునుండి (అనగా పాళీ భాషనుండియే) సం. దీనిని గ్రహించియుండును.

58. పా. కక్కర తె. కక్కెర

పా. లో 'కక్కర' అను పదము 'అడవి కోడి'ని తెలియజేయుచున్నదని నిఘంటుకారుని అభిప్రాయము (జా. 2-162). తెలుగున 'కక్కెర' అను పదము పక్షి విశేషమును తెలియజేయుచున్నది; 'కొక్కెరల్ కక్కెరల్ గువ్వలు' (రసి. 1-67). కాని ఆ పక్షి ఎట్టిదియో మనకు తెలియవచ్చుటలేదు. ఆం. భా. రచయిత దీనిని 'కక్కరేటువు' అను సం. పదముతో ముడివట్టెనని సూ. రా. ని.; కాని ఆ పదము నేటి సం. నిఘంటువులందు పక్షి విశేషముగ కన్పట్టదు. అయినను 'కర్కటు' అను సం. పదము ఒక విధపు కొంగను తెలియజేయునని కలదు. తెలుగున 'కొక్కెర' అని వ్యవహృతమగు పక్షిజాతిలో ఒక కోవకు చెందినది 'కక్కెర' అగునేమో! రైస్ డేవిడ్స్ పాళీ పదమునకు ఇచ్చిన 'అడవికోడి' సరికాదని తోచుచున్నది. ఇది ఎటులున్నను, - ఆ పక్షి ఎట్టిదైనను కానిండు - పాళీలోని 'కక్కర'యే తెలుగున 'కక్కెర'గ మారినది.

59. పా. కక్కారు తె. కాకర

'కక్కారు' అను పాళీ పదమునకు 'ఒక విధమగు లతావిశేషము' అని అర్థము (జా. 6.536). దానికి కాయలు కాయునని అందే కలదు. దీనినిబట్టి చూడ తెనుగువారి 'కాకర'యే ఇది అని భావించుటకు అవకాశము కలదు.

60. పా. కఙ్కా తె. కొంగ

'కఙ్కా' అను పాళీ పదమునకు 'కొంగ' అనియే అర్థము (జా. 5.475). ఈ శబ్దమునకు సం. నను ఇదియే అర్థమున్నను దానికి వ్యాప్తి చాల తక్కువ. అందువలన పాళీనుండియే కొంత రూపవికృతితో 'కొంగ'గ అది తెలుగునకు వచ్చియుండును.

61. పా. కచ్ఛ తె. కంచె

పా. లో 'కచ్ఛ'కు రెండు అర్థములు కలవు 1. ఒక ఆవృత స్థలము. 2. దాని చుట్టుచున్న గోడ, లేక తడిక. తెలుగునను 'కంచె'కు ఈ రెండర్థములును లోకవ్యవహారమున కన్పట్టుచున్నవి. పశువుల బీడును 'కంచె' అని అనుటలో తొలుతటిది కన్పట్టుచున్నది. నిఘంటువులు ఈ అర్థమును గుర్తించినవి. 'కొఱకనంగను బీడునా గొఱసనంగ గంచె యన న[ప్రహతభూమి కాఖ్య లెసఁగు' (ఆం. భా. 2-6). ఇక 'కంచెయే చేను మేసిన కలదె దిక్కు' అను సామెతలో రెండవ అర్థము సుస్పష్టము. కంచెకోట, కంచెగోడ, మొదలగునవి ప్రయుక్తములు.

62. పా. కచ్ఛు తె. గజ్జి

'కచ్ఛు' అనగా పాళీలో దురదయు పొక్కులును చీమును గల చర్మజాడ్యము (జా. 5.207). తెలుగున 'గజ్జి' ఆ అర్థమునే కలిగియున్నది. పాళీలోని పరుషహల్లులు తెలుగున సరళములుగ పరిణమించి, ఉచ్చారణలో కడపటి 'ఉ'కారము 'ఇ' గ మార్పొందినదె

63. పా. [కఞ్జిక / కఞ్జియ] తె గంజి

'కఞ్జిక' యన్నను 'కఞ్జియ' యన్నను వరిఅన్నపు గంజియనియే పాళీలో అర్థము (జా. 1.236). తెలుగున ఆ పదమే 'గంజి' యైనది.

64. పా. కట్ఠ తె. కట్టె

సం. లోని 'కాష్ఠ'కు వికృతిగ సంభావితము పాళీలోని 'కట్ఠ'; కొయ్య అని దాని అర్థము. ప్రయోగములు ఆ అర్థమున విరివిగ కన్పట్టుచున్నవి (సంయు.1-168). వంటచెరకు సైతము 'కట్ఠ'గ ఆ భాషలో వ్యవహృతము (మిళి. 1-284). తెలుగున 'కట్టె'కు ఆ అర్థములే కన్పట్టుచున్నవి. 'పూవుముడిచిన పురవీథిఁ భూమియందుఁ గట్టెమోవంగ వలసిన కారణమున' (భీమ.2-10); కట్టెగుఱ్ఱము, కట్టిక, కట్టెకోట మొదలగు ప్రయోగములు తెలుగుకావ్యములందును శాసనములందును కననగుచున్నవి.

65. పా. కత్తరి తె. కత్తెర

పాళీలో 'కత్తరి' 'కత్తెర' అను అర్థముననే ప్రయుక్తము (జా. 3-298). ఆ పదమే తెలుగున 'కత్తెర'గ పరిణమించినది.

66. పా. కప్పూర తె. కప్పురము

పాళీలో 'కప్పూర'ము సం.లోని 'కర్పూర'మునకు పర్యాయ రూపము (జా.2-416). తెలుగున ఇదియే కొలది మార్పుతో 'కప్పురము' అయినది; 'కప్పురంబు జవ్వాదియుఁ గలిపియిడ్డ కలపముల' (నీలా. 1.105)

67. పా. కబ్బ తె. కబ్బము

గద్య పద్యరచనను—సంస్కృతమున 'కావ్య' మనబడు దానిని - పాళీలో 'కబ్బ' అని వ్యవహరించిరి (జా. 6.410). అది యథాతథముగ ఆ అర్థముననే తెలుగులోనికి దిగుమతి అయినది: 'కబ్బములెమ్మెల్మి గూర్చి' (అచ్చ.రా. బాల. 16)

68. పా. కమ్మార తె. కమ్మరి

లోహపు పనివానిని పాళీలో 'కమ్మార' అని వ్యవహరించిరి (దీఘ. 11-126) (సం.లోని 'కర్మార' పదమునకు ఇది వికృతి). పాళీ పదమునుండియే తెలుగున 'కమ్మరి' రూపొందినది. తెలుగునను ఏవిధపు లోహపుపని చేయువానికైనను 'కమ్మరి' అను పదము వర్తించినదేమో! కాని క్రమముగ ఇనుప పనివాని యందె ఇది రూఢత పొందినది. 'కమ్మరి కనుమరి కరుమలి యనగను మీఱుచుండును నయస్కార సంజ్ఞ' (ఆం.భా. 2-284)

69. పా. కరిస తె. గరిసె

'కరిస' అనునది పాళిలో ఒక కొలపాత్రను, ఆ పాత్రలో పట్టగల గింజలను విత్తగల భూవిస్తీర్ణమును సూచించును (జా. 1-94; 4-233). తెలుగున 'గరిసె' యు అట్టిదే. 'గరిసెల వ్రాతెకాని యొక గంటె డెఱుంగము' అను (అడిదము సూరన) చాటువున ఈ రెండర్థములును సరికుదురుచున్నవి. అంతేకాక 'గరిసె' యన 'ధాన్యాదులనుంచు గాదె' యను అర్థము తెలుగున కలదు. 'కుసూలాభిధ గాదె యనంగను గరిసె యనగ' (ఆం.భా. 2-240)

70 పా. కళేబర తె. కళేబరము

పాళిలో 'కళేబర' పదము, శరీరమునకును (జా. 2-437), శవమునకును (జా. 3-180) వర్తించును. సం.న ఆ పదము 'శరీరము'నకు మాత్రమే వర్తించినటుల సుస్పష్టము. 'చందన చర్చిత నీల కళేబర' అను జయదేవుని ప్రయోగము ఆ విషయమును స్పష్టము చేయుచున్నది. సం. నిఘంటువులలో కేశవమిశ్రుని నానార్థార్ణవ సంక్షేప నిఘంటువు మాత్రమే ఆ పదమునకు 'శవము' అని అర్థమును తెలిపినది. ప్రయోగములు కన్పడవు. తన కాలపు దేశభాషలలో 'కళేబర' పదము పొందిన అర్థాంతరమును కేశవమిశ్రుడు అందు తెలిపియుండును. తెలుగున 'కళేబర' పదము 'శవము'కు మాత్రమే వర్తించుచున్నది. అందువలన పాళి నుండియే ఆ అర్థమున ఆ పదము తెలుగున చొరబారినదనుట సుస్పష్టము.

71. పా. కసట తె. కసటు

పా.లో. 'కసట'యన మాలిన్యము, కల్మషము, అరుచి అను అర్థములు కన్పట్టును (మ. 1.281, జా. 2 96, జా. 5 18) విశేషణముగను విశేష్యముగను ఇది ప్రయుక్తము. (సం లోని 'కష్టి' పదము దీనికి సన్నిహితముగ కన్పట్టును). తెలుగున 'కసటు' పదమునకును దాదాపుగ పై అర్థములే సరికుదురుచున్నవి. 'కలువ పువ్వొళ్ళచేఁ గసటైన వెన్నెల' (పారి. 2.48) 'కసటునాఁ బాపంబు గాఁ దనర్చు' (ఆం. భా. 1.98); 'విసము మెసవినవాటి యక్కసటు పోవ'-శ్రీనాథుని చాటువు!

72. పా కసమ్బు తె. కసవు

'కసమ్బు' అనగ పా. లో 'పనికిరాని వస్తువు, త్రోసివేయదగినది' అను అర్థములు కలవు (మిళి. 414). రైస్ డేవిడ్స్ పండితుడు 'దీనికి సన్నిహిత మగు సంస్కృతపదము కన్పట్ట'దనెను. కాని 'కసామ్బు' అను పదము అధర్వ వేదము (18 4.37) న కన్పట్టుచున్నది. కట్టెలరాసి అను అర్థమచట దానికి సరి కుదురుచున్నది. పాళిలో ఆ పదమే రూపవికృతిని ఆర్థించి, విస్తృతార్థమును గ్రహించియుండును. తె.న 'కసవు'నకు పెంట, 'గంధవహునియాలు కసవు నూడ్చు' (భీమ. 362); గడ్డి; 'కాశీప్రదేశంబునన్ గసవై పుట్టెడు భాగ్యమైన'... (కాశీ. 7.206) అర్థములు కలవు. ఇవి పాళీలోని 'కసమ్బు' కున్న అర్థములకు సన్నిహితములే. సూ.రా.ని. సం. లోని 'ఘాస' నుండి 'కసవు'నకు వ్యుత్పత్తి కల్పించుట సరికుదురదని వేరుగ చెప్పనక్కరలేదు

73. పా. కిచ్చ తె. కించ

'కిచ్చ' అను పదము పాళీలో విశేషణముగను విశేష్యముగను ప్రయుక్తము. 'వ్యథాభరితము' (ధమ్మ. వ్యా. 285) అనియు. ఆపద, దుఃఖము (జా. 5.330) అనియు అర్థములు అందు కన్పట్టును. (సం. లోని 'కృచ్ఛ్ర' పదమునకు ఇది వికృతియని డేవిడ్స్ అభిప్రాయము). తెలుగున 'కించ' విశేష్యముగ మాత్రమే - పాళీలోని పదమునకు సన్నిహితమగు 'మనోవ్యథ' అను అర్థమున-ప్రయుక్తము. 'చిత్తమున కేమియుఁ దోచదు కించ పుట్టె' (సానందో. 3. 38)

74. పా. కుఞ్చిక తె. కుంచెకోల

'కుఞ్చిక' యన పాళీలో 'తాళపుచెవి' (విన. 2. 39). తెలుగు 'కుంచెకోల' యను దానిలో ఈ పాళీ పదమే కొంత వికృతితో కన్పట్టుచున్నది. దేవాలయ కవాటములను వెలుపలినుండి తీయుటకు, వేయుటకు ఈ కుంచెకోలను వాడుదురు. లోపలనున్న గడియను వెలినుండి తీయుటలో తాళపుచెవివలెనే ఇది ఉపకరించును. బహుశః తొలుత 'కుంచిక'గ తెలుగున చేరి, చాల పొడవుగా ఉండుటచే 'కుంచెకోల' అను వికృతిని పొంది యుండును. తెలుగు కావ్యములందు ఈ పదపు ప్రయోగమును కన్పట్టుచున్నది.'కొడవలనెడు కుంచెకోలచే వక్షఃకవాట మిపుడు తెఱచి వామదేవు గర్భగేహమందుఁ గానంగఁజేసితి' (చెన్న. 3. 426)

75. పా. కుడ్డ తె. గోడ

'కుడ్డ' అను పాళీపదపు అర్థము 'గోడ'. ఈ 'కుడ్డ' ఇటుక, రాయి, కొయ్యలలో దేనివలననైన నిర్మితము కాగలదను వివరణయు పాళీ గ్రంథము లందు కననగుచున్నది (విన. 4. 266). తెలుగున 'గోడ'యు ఇట్టిదే. సం. న 'కుడ్య'ము ఈ అర్థమునే సూచించుచున్నది; కాని 'కుడ్య' నుండి కన్నను 'కుడ్డ' నుండియే 'గోడ' రూపొందినదనుట చారిత్రక దృష్టిలో సముచితము.

76. పా. కుణి తె. కుని

పాళీలోని 'కుణి'కి 'వంపుతిరిగిన' అని అర్థము (జా. 1. 353). తెలుగున 'కుని'యు అట్టిదే. సాధారణముగ పొలపు గట్టుల విషయముననే ఇది ప్రయుక్తము. పావులూరి మల్లన తన గణితసార సంగ్రహమున 'లోకుని వెలికును లెల్లను చేకొని చదరమ్ము చేసి' అను దానిలో దీనికి గ్రంధ ప్రయోగము కన్పట్టు చున్నది. లోక వ్యవహారమున ఈనాడును వ్యావసాయికులందు ఈ పదము వాడుకలో ఉన్నది.

77. పా. కుద్దాల తె. గుద్దలి, గొడ్డలి, కొడవలి

పాళీలోని 'కుద్దాల' పదము వేరులను, దుంపలను త్రవ్వికొనుటకు ఉపయోగించు సాధనమునకు వాడబడినది (జా. 1-225) తెలుగున 'గుద్దలి'యు అట్టిదే. పొలమును దున్నుటకు ముందుగ, పనికిరాని మొక్కలను వేరులతో కూడ తొలగించుటకు రైతులు దీనిని వాడెదరు. కావ్యములందును ఇది ప్రయుక్తము 'గుద్దండ్లనుం బెద్ద గునపంబులను గోట యొండొంటత్రవ్వట' (హరి. ఉ. 2-16). క్రియగ గూడ 'గుద్దలించు' అను ప్రయోగము విరివిగ కన్పట్టుచున్నది.

సం. న'కుద్దాల' పదము ఈ అర్థముననే కలదు. సంస్కృతము తెలుగు దేశమున నెలవు నార్జించుటకు పూర్వముననే వ్యావసాయిక రంగమున 'నాగలి' మొదలగు పదములు పాళీనుండి తెలుగులోనికి వచ్చియుండుటవలన 'గుద్దలి'యు పాళీనుండియే తెలుగులో చేరియుండును.

'గుద్దలి' చేయుపని 'నరుకుట'; ఈ పనినే వేరువిధముగ నిర్వర్తించునవి గొడ్డలి, కొడవలి. ఇవియు 'గుద్దలి' నుండియే రూపొందియుండునని భావించుటకు ధ్వని సాన్నిహిత్యమువలన అవకాశము కలదు. సం. పదమగు కుఠార

నుండి 'గొడ్డలి' రూపొందినదని సూ. రా. ని. భావించుట అసమంజసము. కొడ వలి పదపు వ్యుత్పత్తిని సూ. రా ని. విచారించినది కాదు.

78. పా. కుల్ల తె. గుల్ల

'కుల్ల' అను పాళీపదమునకు 'బోలుగానున్న' అని అర్థము (విన 1-230). తెలుగున 'గుల్ల'యు ఈ అర్థమునే కలిగియున్నది. 'అన్నిశాచరుని నొడిసి, కాలు పట్టి మీదికి నెత్తి నేలతోఁడ, నొడలు గుల్లలతిత్తిగా నుదికి' (భా. రా. యు 680). గుల్లకంటె, గుల్ల మురుగులు, చింతగుల్ల మొదలగునవి వ్యవహార సిద్ధములు. **సం.** లోని 'కుల్య'యే పాళీలో 'కుల్ల' యైనదని రైస్ డేవిల్స్ అభిప్రాయము.

79. పా. కుసి తె. కుసి

'కుసి' అను పాళీ పదమునకు 'వస్త్రపు నాలుగంచులలో ఏరెండైనను సంధించు చోటు' అని అర్థము (విన: 1-287). 'మంచపు నాలుగు పట్టెలలో ఏ రెండు పట్టెలైనను కొనగలసిన చోటు' అను అర్థము తెలుగున దీనికి ఏర్పడి నది. అర్థములందు సాన్నిహిత్యము సుస్పష్టము. తెలుగు నిఘంటువులు ఈ పదమును గుర్తించినవి. 'కుసి కూచమనఁ బట్టికాగ్రమై యలరుచుండు' (ఆం. భా. 2-164.) సూ. రా. ని. దీని వ్యుత్పత్తిని విచారించినది కాదు. 'మంచెపు పట్టె కుసి వద్ద విరిగినది' అనుట లోక వ్యవహారమున కలదు.

80. పా. కూర తె. కూర

పాళీలో 'కూర' అన 'వండిన భోజ్య పదార్థము' (విన 4-86). తెలుగున ఆ అర్థము కొంత సంకుచితమై 'కూర' అనునది వండిన శాకాదులగు అను పాకములకే వర్తించుచున్నది; అపక్వ శాకాదులకును కొన్ని యెడల విని యుక్తము. కావ్యములందు పెక్కింట ప్రయోగములును కన్పట్టును. తమిళము లోని 'కఱి' నుండి ఈ పదము రూపొందినదని సూ. రా. ని. భావించుట అనుచితము.

81. పా. కోట్టన తె. కొట్టుట

పాళీలోని 'కోట్టన'కు 'కొట్టుట' అనియే అర్థము. పిండిగ కొట్టుట, సుత్తెతో కొట్టుట, విరుగగొట్టుట అని అర్థములిచ్చు ప్రయోగములు పాళీలో కననగు చున్నవి (జా. 1-473; జా 2-18; జా. 6-86). తెలుగున 'కొట్టుట' ఇట్టి సందర్భములందే వినియుక్తము. కావ్యములందును, వ్యవహారమునందును, లక్ష్యములు విరివిగ కలవు. **సం.** లోని 'కుట్' ధాతువునుండి ఇది నిష్పన్నమని దేవిడ్స అభిప్రాయము.

82. పా. కోట్ఠ తె. కొట్టు

ధాన్యాదులను నిలువజేయు గృహము లేదా గదిని 'కోట్ఠ' అని పాళీలో వ్యవహరించిరి (పే.వ. వ్యా. 126). తెలుగున 'కొట్టు' అనగ సామగ్రులు ఉంచెడు గదిగ వ్యవహార సిద్ధము. కావ్యములందు ఆ అర్థమున లక్ష్యములును కలవు; 'కొట్లు బేహారుల గొనలు టంగడులంద' (అచ్చ. రా. బాల. 47).

83. పా. కోణ్ట తె. కొంటె

'కోణ్ట' యను పాళీ పదమునకు 'విపరీతపు అలవాటులు కలవాడు' అని అర్థము. ఆ భాషలో విశేష్యముగ మాత్రమే వినియుక్తము (జా. 2-209). తెలుగున ఆ అర్థముననే విశేష్యముగను, విశేషణముగను వినియుక్తము. 'కొంటెవుగద నిన్నెఱిగి కొంటిమి కృష్ణా' (భాగ. 10 పూ. 822); 'కొంటె తనంబునన్ గెలిచికోలిది యచ్చెరువంబు మన్మథా' (కృ. శకుం. 2-179) ఇక కొంటెము, కొంటీఁడు, కొంటెఁడు, కొంటికత్తె - ఇత్యాదులు 'కొంటె' నుండి నిష్పన్నములా యనుట శోధింపవలసిన విషయము.

84. పా. కోణ్ఠ తె. కుంటి

పాదవికలుడు, లేదా పాదరహితుడగువాడు పాళీలో 'కోణ్ఠ' అని వ్యవహృతుడు (జా. 2-118). తెలుగున 'కుంటి'యు అట్టిదే. **సం.** లోని 'కుంఠ'కు పాళీపదము సన్నిహితము. కాని, పాళీ పదమునుండియే తెలుగునకు చొరబారి యుండును.

85. పా. ఖజ్జక తె కజ్జకాయ

పా. లోని 'ఖజ్జక' ఒక తినుబండారమును తెలియజేయును (జా. 1.186). కాని అది విశేషణముగ మాత్రమే ఆ భాషలో ప్రయుక్తము. తెలుగున 'కజ్జకాయ' అర్థమున పాళీ పదమునకు సరికుదురుచున్నను, విశేష్యముగ వాడుకలో ఉన్నది.

86. పా. ఖమ్భ తె. కంబము

పా. లో 'ఖంభ' 'స్తంభము'ను తెలియజేయును (విన. 1.213). తెలుగున 'కంబము'ను అట్టిదియే, 'పంకంబులోని కంబంబు తర్కము' (నైష. 7.78)

87. పా ఖరక తె గరుకు

'ఖరక' అనుదానికి 'నునుపుగా లేనిది' అని అర్థము (పే. వ. వ్యా.) తెలుగున 'గరుకు' అదే అర్థమున అది చేరినది. లోక వ్యవహారమున ఇది విస్తృతముగ వాడుకలో ఉన్నది.

88. పా. ఖల తె. కళ్ళాము; కళ్ళము

పా. లోని 'ఖల' ధాన్యాదులకొరకై నూర్పిడిని సాగించు భూమిని తెలియజేయును (చు.ని. 587). తెలుగున కళ్ళము (కళ్ళాము) ఇట్టిదాననే నిర్దేశించును. 'మిను కళ్ళము. తారలు చిక్కిన గింజలు' (వరాహ. 4 148)

89. పా. ఖార తె. కారము

పా. లోని 'ఖార' అనునది సం. 'క్షార'కు వికృతి. సం పదమునకు ఉన్నటులనే ఉప్పగనుండునది; ఘాటుగ మంటను కలిగించునది - అను రెండర్థములు పాళీ పదమునకును కలవు (సంయు. 3.131; సద్ధ. 281). ఈ రెండవ అర్థమునే తెలుగులోని 'కారము' నిలుపుకొనినది. 'మిరియపు కారంబు వోలె మెచ్చొనరించెన్' (నైష. 7.80)

90. పా. ఖారి తె. కాడి, ఖారి, కావడి

పా. లోని 'ఖారి' పదము ఒక ఆయతనపు కొలపాత్రను తెలియజేయును ఈ అర్థమున అది 'ఖారిక' అను విశేషణముగనే గ్రంథములందు వాడుకలో

ఉన్నది (సుత్త. 126). ఇక ఖారి-ఖార ఇత్యాది ప్రయోగములు కలవు (సంయు. 1.169). ఇచట 'ఖారి'తో మోయదగిన బరువనియే అర్థమును పండితులిచ్చి, 'ఖారి' ఒకవిధపు దండ విశేషమనిరి. పరివ్రాజకులు తమతో కొనిపోవలసిన యెనిమిది విధముల వస్తువులలో 'ఖారి-కాజ' ఒకటెయని బౌద్ధగ్రంథము లందు కలదు. అప్పుడది 'ఖారి' బరువునుమోయు కాడి అని కొందరు వ్యాఖ్యాతలనిరి. ఈ చర్చవలన ఈ క్రింది విషయములు సుస్పష్టములు.

1. 'ఖారి' అనునది ఒక కొలత ప్రమాణము. ఆ విధముగ తెలుగునను ఇది కలదు. తెలుగు శాసనములందేమి, ప్రాచీన గణిత గ్రంథములందేమి 'పుట్టి' అను తెలుగు పదమును సూచించుటకు 'ఖ'ను వాడిరి. ఇది ఖారికి సంక్షిప్త రూపమని ఎల్లరంగీకరించినది.

2. సం. నను 'ఖారి' అనునది కొలప్రమాణమును తెలియజేయును. దీనికీ ఈ అర్థముననే 'ఖార' అను రూపమును కననగుచున్నది. వ్యుత్పత్తి కానరాదు. బహుశః ఒక కఱ్ఱకు తగిలించి మోయగల బరువునకే ఇది ఉద్దిష్టమై యుండును. తెలుగున ఈ భావముననే ఇది చొరబారి కావడియైనది; ఇక 'కాడి'యు ఇట్టిదియే. 'ఖారి' 'కాడి'గా పరిణమించుట సహజము. 'కాడి' వలన (ఎద్దుల సాయమున) లాగగల బరువును సూచించునదియే క్రమముగ 'ఖారి'గ పరిణమించి గణిత గ్రంథములలోనికి చేఱియుండును.

91. పా. ఖుద్దక తె. కొండిక, కొండొక, కొండుక

'ఖుద్దక' అను పాళీ పదమునకు 'చిన్నది' అని అర్థము. వస్తువుల ప్రమాణముల భేదములను తెలుపుటకు ఆ భాషలో 'ఖుద్దక, మజ్ఝిమ, మహా' పదములను వాడుదురు (విసు. 100). పా. లోని 'ఖుద్దక'యే తెలుగులో 'కొండిక'గా మార్పొంది ఆ అర్థమునే కలిగియున్నది. 'భూమండల మతి సూక్ష్మాకృతిఁ గొండిక మచ్చయును బోలెఁ గొమరొందు హరీ' (పాండు 2-60). ఇక 'కొండుక' 'కొండొక' దీని రూపాంతరములే. 'కొండొక'ను సూ. రా. ని. **సం.** లోని 'కుణక' నుండి సాధించ యత్నించి పొరపడినది.

92. పా. గద్ధ తె. గద్ద

సం.లోని 'గృధ్ర' పదమునకు సమానార్థకము పాళీలోని 'గద్ధ' (విన. 2.377). తెలుగులోనికి అది దాదాపుగ యథాతథముగ వచ్చి చేరినది.

93. పా. గారవ తె. గారవము

**సం.** లోని 'గౌరవ' పదపు అర్థమే పా. లోని 'గారవ'కును కలదు (విన. 5-92). ఇదియే తెలుగున గారవము, గారాబము, గారాములుగా మారి కొలది ఛాయా భేదములతో ఆ అర్థమునే సూచించుచున్నది; 'గారవమున నట్ల చేసి భక్తిననుచరింతు' (భార విరా. 1-184)

94. పా. గుమ్బ తె. గుంపు

**సం** లోని 'గుల్మ'కు వికృతియే పా. లోని 'గుంబ' యని రైస్‌డేవిడ్స్ అభిప్రాయము 'గుంబ' యన 'సమూహము' అని అర్థము (విన. 1. 345). తెలుగులోనికి ఆ పదమే కొంత వికృతిజెంది 'గుంపు'గ ఆ అర్థముతోనే చొర బారినది; 'నిడుదపెన్నెఱి గుంపు జడగట్ట' (మనుచ. 2 9)

95. పా. గుళా తె. గుల్ల

పా.లో 'గుళా' అనునది 'శరీరముపై బాధను కలిగించు బొబ్బ, పొక్కు' ను తెలియజేయును (దీఘ.2-55). తెలుగు 'గుల్ల'యు ఇట్టిదే,

96. పా. గేణ్డుక తె. చెండు

**సం** లోని 'కందుక'కు ఉన్న యర్థమే పా లోని 'గేణ్డుక'కు కలదు (విసు. 143). తెలుగునందలి 'చెండు' దీని రూపవికృతియే యగును;'కందుకము చెండు బంతి నాగను దనర్చు' (ఆం భా. 2-164). పాళీలోనే 'భేణ్డక' అను రూపము 'గేణ్డుక'కు కొన్ని గ్రంథములందు ఈయబడినది (జా. 4-30); తెలుగున చెండుకు పర్యాయ రూపముగ 'బంతి' యనునది దీనినుండి రూపొంది యుండును.

87. పా. గేరుక తె. జేగు(వు) రు (లు)

**సం.** లోని 'గైరిక'యే **పా.** లో గేరుక. 'కాషాయపు ఎఱుపురంగు'ను ఇది తెలియజేయును (విన. 1.203). తెలుగునందలి 'జేగురు' పా. లోని 'గేరుక' నుండియే నిష్పన్నము. అందు కన్పట్టు ధ్వని పరిణామము ధ్వనిశాస్త్ర సూత్రములకు అనుగుణమైనదే; ఆ అర్థమున ప్రయోగములు కలవు; 'కనుగ్రేవల జేవులు పుక్కిలింపగా' (మనుచ. 5.50).

98. పా. చత్త తె. చెత్త

'చత్త' యన పాళిలో 'త్రోసివేయబడినది' (థేర. 1-209) అని అర్థము. '(త్యజ' అను సం. పదపు వికృతియని రైస్ డేవిడ్స్ అభిప్రాయము). తెలుగున 'చెత్త' ఈ అర్థముననే ప్రయుక్తము, 'చెత్తనఁజెదారమనిన నవకర మొప్పను' (ఆం భా. 2 22).

99. పా. చప్పేతి తె. చప్పరించు

పాళిలోని 'చప్పేతి' అను పదమునకు 'నమలుట' అని అర్థము సం.లోని 'చర్వయతి'కి ఇది సన్నిహితమని ఒక వ్యాఖ్యానకారుని అభిప్రాయము (విన. 2.115). తెలుగున 'చప్పరించు' ఇట్టిదియే 'లేఁదలిరులు చవిచూచు దర్భలు చప్పరించు' (భా.రా.యు. 2555).

100. పా. చాగ తె. చాగము

సం. లోని 'త్యాగ' పదపు అర్థమే పా. లో 'చాగ'కు కలదు (విన. 1.10) పాళీపదము తెలుగులోనికి యథాతథముగ వచ్చి, ఆ అర్థముతోనే చేరినది. 'శాంతియు దాంతియుఁ జాగంబు భోగంబు' (భార. విరా. 1.67).

101. పా. చిఞ్చ తె. చింత

పా. లో 'చిఞ్చ' అన చింత చెట్టు (జా. 5-38). సం. లోను 'చిఞ్చ' అను పదము ఈ అర్థముననే కలదని ఒక పండితు డనెను. సాధారణముగ 'తింత్రిణి'యే సంస్కృతమున ఇందులకై వాడుకలో ఉన్నది. తెలుగున 'చింత'యు ఆ చెట్టునే తెలియజేయుచున్నది. 'చింతయనంగను జించయా' (ఆం. భా. 2-47).

102. పా. చిల్లక తె. చిలుకకొయ్య

పా.లో 'చిల్లక' అన 'మేకు' అని అర్థము. దేనినైనను కదలకుండ ఆపుటకు ఇది వినియుక్తము (థేరీ. వ్యా. 257). తెలుగున 'చిలుక కొయ్య'యు ఇట్టిదే. తలుపును మూసినపుడు దీనిని పైన తగిలించి, తలుపు రాకుండ జేయు

దురు. అందువలననే 'చిలుక వేయుట' యన, 'గొళ్లెము తగిలించుట'యని తెలుగుదేశమున కొన్ని ప్రాంతములలో వాడుక కలదు. ఇంతేగాక పగ్గములు మొదలగు వానిని వ్రేలాడదీయు మేకును కూడ 'చిలుక కొయ్య' అనియే వ్యవహరింతురు. ఈ రెండవ అర్థమున కావ్యములందు ప్రయోగములు కలవు. 'వాఁతెనలు మోకులుఁ బుచ్చి యెదిరి చిలుకకొయ్య దవిల్చి' (పండితా. దీక్షా. 41 పు.) పా. లో 'దారుక చిల్లక' అను ప్రయోగము సైతము కలదు. దాని నుండియే తె.లోని 'చిలుకకొయ్య' రూపొందియుండును.

103 పా. చీర (చీవర), చీరక తె. చీర, చెఱఁగు

పాళీలోని 'చీర'యును 'చీవర'యును సమానార్థకములు. 'ధరియించుటకు ఉపయోగించు వస్త్రము' అనియే అర్థము (విన. 1-605). సంస్కృతమునను ఈ రెండు పదములు కలవు. కాని పాళీలో ఉన్నంతగ ఆ పదముల ప్రయోగము సం. న కన్పట్టదు. బౌద్ధ భిక్షువులు తమతో కొనిపోవు వస్త్రములకు ఆ రెండు పేరులును వాడుకలో ఉండుట వలన, వారి వలననే తెలుగు దేశమున వానికి వ్యాప్తి కలిగినది. సమానార్థకములగుటచే 'చీర' మిగిలియుండును. స్త్రీ, పురుష విభేదము లేకుండ ఎవరు ధరించునదియైనను 'చీర' యనియే పాళీలో వ్యవహృతము (విన. 3-89). తెలుగునను తొలుత ఇట్టి అర్థమే ఉండినది. 'పేరు వలలుండు కూడుం, జీరయు నిడి సాక్షతంబు సేసినఁ జాలున్' (భార. విరా. 1.219). కాలక్రమమున వాడుకయందు అది స్త్రీ వస్త్ర పర్యాయముగ పరిణమించినది.

ఇక 'చీరక' అనగ పాళీలో 'చీరలోని భాగము'. సాధారణముగ చీర యంచునకే ఇది వాడబడుచుండెడిది (జా. 5.107). తెలుగులో 'చెఱఁగు'ను అట్టిదియే. శకటరేఫయు, అర్ధానుస్వారమును తెలుగువారి ఉచ్చారణ రీతిని బట్టి అందు చేరినవి. తెలుగున 'సీర'యు 'చీర'కు వికృతియే యగును. 'చీలిక'యు 'చీరక' నుండియే రూపొందినది.

104. పా. చుణ్ణ తె. సున్నము

పా. లో 'చుణ్ణ'కు 'సున్నము' అనియే అర్థము (జా. 1.126). తెల్లగ ఉండు సున్నపు పొడికేగాక, ఇసుకతో కలిపి ముద్దజేసి కట్టుబడికై ఉపయోగించు

దానిని కూడ 'చుణ్ణ' అనియే పాళీలో వ్యవహరించిరి (విన. 1.202). తెలుగున 'సున్నము'నకు ఈ రెండర్థములును వ్యవహారమున కలవు ఈ అర్థములందే కావ్యములందు ప్రయోగములును కలవు. 'సౌధము మీదను సున్నము నిగిడించి నట్టి జోడరుగులపై' (భీమ. 2.216); 'మేఁకబొక్కులు పొక్క మెదియించి సున్నంబు మెత్తఁజల్లునె మీకు' (నీలా. 3.34).

105. పా. చొక్ష తె చొక్కము

పా. లోని 'చొక్ష' పదము ఒక విశేషణము; 'పరిశుభ్ర(శుద్ధ)మైనది' అని దాని అర్థము (మజి 1 89). తెలుగున 'చొక్కము' విశేష్యముగనే కావ్యము లందు వాడబడినను పాళీలోని పదమునకు సన్నిహితమై 'నిర్దోషము' 'స్వచ్ఛము' అను అర్థములను కలిగియున్నది 'చొక్కపుఁబసిండి సక్కుఁఁ జెక్కుఁజెక్కులక్కలికికిఁగల్గు' (రామా. 4 69); 'తమ చక్కని నగవు చొక్కపు జీని చక్కెరని చొక్కి' (దశా. 1.14) 'చొక్కించు' అను తెలుగు క్రియయు దీనినుండియే రూపొందినది. 'చక్కదనము' అను తెలుగు పదమునకు దీనితో ఉన్న సంబంధము శోధింపదగినది.

106. పా. ఛక్క తె. చక్కా

'ఛక్క' అను పాళీపదము ఒక విధపు సంఖ్యావాచకము. ఆరు వస్తువుల సంఘటనమును ఇది తెలియజేయును (విసు. 242). తెలుగున 'చక్కా' అను రూపమును అది పొందినది. ఈ పదము గవ్వలాటలో తెలుగుదేశమున వాడుకలో నున్నది. ఆరు గవ్వలు అనుకూలరీతిలో పడినపుడు ఈ పదమును వాడెదరు.

107. పా. ఛణక తె. సెనగలు

పా. లోని 'ఛణక' పదపు అర్థము 'సెనగలు' అను ధాన్యవిశేషమే (మిళి. 352). సం.మునను 'చణక' పదము కలదు. కాని వ్యావసాయిక పదములన్నింటితో పాటు ఈ పదమును ప్రాకృత భాషలనుండియే తెలుగున చొరబారినదనుట చారిత్రక దృష్టిలో సమంజసము. కావ్యములందు 'సెనగలు' అనియే తెలుగున ఈ పదము కన్పట్టుచున్నది. 'అనుములు గోధూమంబులు సెనగలునుం బండు' (భీమ. 4-67). కాని లోక వ్యవహారమున కొన్ని ప్రాంత ములందు 'చెనగలు' అనునదియు విననగుచున్నది.

108. పా. ఛాదియ తె. చెత్త

పా. లో 'ఛాదియ' యన పైకప్పు; ముఖ్యముగ పూరింటి పైకప్పుగా వాడబడు తృణాదికము (జా. 6-34). తెలుగున పూరింటి పైకప్పునకు వేయునది ఇట్టిదే. 'చెత్త'గ పరిణమించినదిదియే. ఇచట 'చెత్త'యన గడ్డియని అర్థము.

109. పా. ఛిద్ద తె. చెడ్డ

పా. లో 'ఛిద్ద' యన 'లోపపూరితమైన, చెడిపోయిన' అను అర్థములు కలవు (విన. 1-29) .సం. లోని 'ఛిద్ర' కు వికృతి కానోపునని ఒక నిఘంటు కారుని అభిప్రాయము. సం. లోని అ పదమునకు 'రంధ్రము, పగులు' అను అర్థములు కలవు. పాళిలో 'ఛిద్ద'కు ఆ అర్థములకు తోడుగ పైననిచ్చిన అర్థములును కలవు. 'చెడ్డ' ఇట్టిదియే. విశేషణముగ 'దుష్టపు' అని దీని అర్థము.

110. పా. 'ఛిజ్జ' తె. చించి

పా. లోని 'ఛిజ్జ' యన రెండుగ చీల్చి అని అర్థము (జా. 3-181). తెలుగున 'చించి' అనునపుడు ఈ అర్థమే పొసగును. 'చించినదియఁట తద్దైర్య కంచుకంబు' (నైష. 1-80). పా. లో 'ఛిన్దతి' అను క్రియ కలదు. అదియే తెలుగున 'చించు'గ మారినది.

111. పా. జూత తె. జూదము

సం. లోని 'ద్యూత' పదమునకు పర్యాయ పదమే పాళిలోని 'జూత' (దీఘ. 1-7). తెలుగున 'జూదము' ఆ అర్థముననే ప్రయుక్తము; 'జూదపు సిరి యాసపడం గాదని విదురుండు సెప్పగా' (భార. ఉద్యో. 1.316).

112. పా. జోతి తె. జోతి

సం. లోని 'జ్యోతి'యే పా. లోని జోతి; ఇది యథాతథముగ, అదే అర్థమున తెలుగున చేరినది; 'వెలయుఁ బ్రకాశంబు మెఱుగు జోతి యనంగను' (ఆం. భా. 1.82)

113. పా. ఇత్తి తె. నచ్చి (క)

పా. లో 'ఇత్తి'ని సం. లో 'జ్ఞప్తి' కి సన్నిహితమని ఒక నిఘంటు కారుడు భావించెను. కాని 'ఇత్తి' యొక్క అర్థము సం.పు 'జ్ఞప్తి' కన్న విపులతరము. ఒక బౌద్ధ సంఘమున చర్చితమై ఆమోదము పొందిన విషయము 'ఇత్తి' (విన. 2-80). తెలుగున ఇది తొలుతగ 'నత్తినది'గా చేరి 'నచ్చినది' అను రూపమును పొందియుండును. నచ్చినదన ఆమోదితమే - దీనిని విశేష్యముగ మార్చినపుడు 'నచ్చిక' వచ్చినది. 'సకల జనంబులు సిరులందొకటను నచ్చికము లేక యుండ' (రామా. 178).

114. పా. ఞాయ తె. నాయము

సం. లోని 'న్యాయ' పదపు పర్యాయరూపమే పా. లోని 'ఞాయ' (విన. 1. 10). సం. న ఉన్నటులనే పా. లోను ఆ పదమునకు తర్కశాస్త్ర విషయిక మగు అర్థమున్నను, 'సముచితము', 'ధర్మయుతము' అను అర్థములకే విశేష వ్యాప్తి కలదు. తెలుగున ఈ అర్థములే 'నాయము'నకు కలవు 'మాకు నాయంబె నీతోడ మాటలాడ' (నైష. 4. 59).

115. పా. ఠాణ తె. ఠాణము

'ఠాణ' అను పాళీపదమునకు 'స్థలము' అని అర్థము (దీఘ. 2. 140). తెలుగున ఇది యథాతథముగ ప్రవేశించి ఆ అర్థమునే కలిగియున్నది, 'ప్రోద తనంబుల ఠాణముల్ పురింబొదలెడి భూసురోత్తములు భూరి పవిత్ర శరీర వల్లరుల్' (పాండు. 1. 108). అయినను క్రమమున తెలుగున ఇది విస్తృతార్థమును గ్రహించి 'కావలి స్థానము' అను అర్థమును గ్రహించినది.

116. పా. తక్కర తె. టక్కరి

సం లోని 'తస్కర'కు వికృతియగు 'తక్కర'కు 'దొంగ' అని అర్థము (జా.4.432). తెలుగున 'టక్కరి'గ ఇది రూపొంది, ఆ అర్థమునే కలిగి యున్నది; 'టక్కరు లుక్కివుల్ బలుతటారులు క్రూరులు' (సమీర. 4.22)

117. పా. తట తె. తట్టు

పా. లోని 'తట' సం. లోని అట్టి పదపు అర్థమునే కలిగియున్నది. 'ఒడ్డు, పార్శ్వము' అను అర్థములు దానికి కన్పట్టుచున్నవి (జా. 1.232). తె లోని తట్టును ఇట్టిదియే. 'ఫలంబులొసగుచు నొక్క తట్లు నెట్టుకొనఁగ నగరు వెడలి' (అచలా. 1.37).

118. పా. తట్టక తె. తట్ట, తట్టి

'తట్టక' యను పాళీ పదమునకు 'అన్నమును పెట్టుకొని తినెడి పళ్ళెము' అని అర్థము (జా. 3.10); తెలుగున 'తట్ట', 'తట్టి' యనునవి ఆ అర్థముననే వాడుకలో ఉన్నవి. 'తెలె హరివాణంబు తలిగ కంచము తట్ట... యనంగ గంసంబు దనరు' (ఆం.భా. 2 244); 'తట్టి కంచమనగఁ దనరుఁ బాత్ర' (ఆం. సం. మాన. 30)

119. పా. తట్టిక తె. తడిక

పాళీలోని 'తట్టిక'కు 'తాళపత్రములు మొదలగు వానిచే రూపొందింపబడిన ఒక సాధనము (విన. 4.10). 'తడ్డిక' అను రూపమును దీనికి కలదు. (విసు. 97). తెలుగులోని 'తడిక' దీని వికృతియే; అర్థమున మార్పెట్టిదియు లేదు; 'పురుషవరుని బొంకు పూరి తడిక' (వేమన. 2 329).

120. పా. తతియ తె. తదియ

లెక్కలో మూడవవదానిని 'తతియ' అని పాళీలో వ్యవహరింతురు (సుత్త. 97). తెనుగున 'తదియ' అనునది దీని వికృతియే. అర్థవిస్తృతిని పొంది ఇది తిథులలో మూడవదిగ లెక్కకు వచ్చినది, 'విదియనాఁ దేరుపడకున్నఁ దదియనాఁడు కానఁబడియెడు' (యయా. 5 6).

121. పా. తన్తి తె. తంతి

పాళీలోని 'తన్తి'కి 'వీణమొదలగు నానికి వాడెడు సన్నని లోహపుతీగ' యని అర్థము (జా. 3. 178) తెలుగున 'తంతి'కి ఈ అర్థమే కలదు 'తంతి వాద్యము' అను దానియందు ఇది సుస్పష్టము. 'తంతి యనంగను దంత్రి వెలయు' (ఆం. భా. 1. 126).

122. పా. తంబూల తె తాంబూలము, తములము

'తంబూల' అను పాళీ పదమునకు 'తమలపాకులు', లేదా, 'వక్కతో కలిపి ఇచ్చెడి తాంబూలము' అని అర్థము (జా. 1. 266). తెలుగున 'తాంబూలము' తములము ఇట్టివియే. ఈ పదము సంస్కృతములో ఉన్నను, పాళీ నుండియే సం. లోనికి అది చేరినదనుట పదరూపమును బట్టి సుస్పష్టము. 'తమ్బ' అను పా. పదమునకు 'ఎర్రనిది' అని అర్థము. అందుండియే 'తంబూలము' రూపొంది, క్రమముగ సం. లోనికిని తెలుగులోనికిని చొరబారినది. 'తములము' ఆ పదపు వికృతియే. 'తమ్మ' అనునది ఎర్రని విడెమునకు తెలుగున వాడ బడుట ఇట గమనింపదగినది. 'తములము'నకు కావ్యములందు ప్రయోగములు కన్పట్టును; 'తములము సేయని నోరును' (సు. శ. 53).

123. పా. తరచ్ఛ తె. రేచు

శునకజాతికి చెందిన ఒక క్రూరజంతువు 'తరచ్ఛ' అను పేరున పాళీలో వ్యవహృతము (విన. 3. 58). సం.లోని 'తరక్షు' శబ్దము ఇట్టిదియే. ఆద్యక్షర లోపమును, కొంత వికృతినిపొంది, పా. పదమే తెలుగున 'రేచు'గ నిలిచినది.

124. పా. ఠిట్ఠ తె. దిట్టము

పా. లోని 'ఠిట్ఠ' గట్టితనమును తెలియజేయును (జా. 6-212); తెలుగున 'దిట్టము'నకు కూడ 'దృఢము' అను అర్థమే కలదు. 'సద్భోగినీ పట్టమున్ దిట్టమౌనట్టుగా వేఁ బ్రసాదించి' (భోగినీ).

125. పా. తిప్ప తె. తిప్పలు

'తిప్ప' యన పాళీలో 'బాధాజనకము' అను అర్థము సరికుదురుచున్నది (మిళి. 1-10); తెలుగున ఇది విశేష్యముగ, బహువచనమున మాత్రమే ప్రయుక్తమై 'బాధలు' అను అర్థమును కలిగియున్నది.

126. పా. తీరణ తె. తీర్పు; తీరుపు

'తీరణ' యను పాళీ పదమునకు 'న్యాయ నిర్ణయము' అని అర్థము (విసు. 162). తెలుగున 'తీర్పు' 'తీరుపు' అట్టివియే.

127. పా. తీరేతి తీర్చు, తీరుచు

'చక్కగ పరిష్కృతము చేయు' అను అర్థమున పాళీలో 'తీరేతి' వినియుక్తము (మిళి. 7). తెలుగున 'తీర్చు'. 'తీరుచు' ఆ అర్థముననే వినియుక్తాలు. 'తీరిచినట్లులున్నవి కదే కనుబొమ్మలు' (విజయ. వి. 1.66.).

128. పా. తేమన తె. తేమ

'నీటిచే చెమ్మగిల జేయుట' అని 'తేమన' అను పాళీ పదమునకు అర్థము (విసు. 338). తెలుగున 'తేమ' విశేష్యముగ దరిదాపుగ అ అర్థముననే వాడబడుచున్నది.

129. పా. థిర తె. తిర

'స్థిరము' అను అర్థమున పాళీలోని 'థిర' వినియుక్తము (జా. 1-220). తెలుగులోని 'తిరము' అట్టిదియే 'ఇమ్మేదిని దోర్దండైక పీఠమునన్ దిరము పజిచి' (మనుచ. 1-23).

130. పా. దత్తి తె. దద్ది

పాళీలోని 'దత్తి'కి 'దానము' అని అర్థము (మ. 1-78). ఈ పదము యథాతథముగ తెలుగున చొరబారి ఆ అర్థముననే రేనాటి చోళుల శాసనము లందు ప్రయుక్తము

131. పా. దద్దు తె. దద్దు

'శరీరముపై కలిగెడి చిన్నవాపు' అను అర్థమున పాళీలోని 'దద్దు' ప్రయుక్తము. సం లోని 'దద్రు'కు సమానార్థముగ ఇది కన్పట్టుచున్నది. ఒక ప్రాకృత నిఘంటుకారుడు దీనికి 'తామర అను శారీరక జాడ్యము' అను అర్థమును ఇచ్చెను. కొందరు కుష్ఠపు మచ్చలుగను లెక్కించిరి. తెలుగున ఇది 'చిన్న వాపు' అను అర్థముననేగాక 'తడపర' అను శరీర జాడ్యమునకును వాడబడుచున్నది

182. పా. దన్ధ తె. దద్దమ్మ

'మూర్ఖుడు' అను అర్థమున పాళీలో 'దన్ధ' వినియుక్తము (మ.1-458). తెలుగున 'దద్దమ్మ' అనునది లోకవ్యవహారమున ఆ అర్థమునే కలిగియున్నది.

183. పా. దుక తె. దుగ

'జత' లేక 'రెండు చేరియున్నది' అను అర్థమున 'దుక' పాళీలో ప్రయుక్తము. (విసు. 11). తెలుగున ఈ పదము 'దుగ' అనురీతిగ చొరబారి 'ద్వికము' అను అర్థమును పొందినది. 'దుగ యనగ రేచయనఁగను దోఁచు ద్వికము' (ఆం. భా. 2-305).

184. పా. దుట్ఠ తె. తుట్టె

'చెడ్డది' అను అర్థమున పాళీలో 'దుట్ఠ' వినియుక్తము (విన. 3.118). తెలుగున 'తుట్టె' అను రూపును ఇది పొంది, 'నీచము', 'క్షుద్రము' అను అర్థములలో వినియుక్తము. 'తుట్టెపురుగు' అను పదమున ఈ అర్థమే సరికుదురుచున్నది.

185. పా. దుపట్ట తె. దుప్పటి

'జమిలి నేత వస్త్రము' అను అర్థమున పాళీలో 'దుపట్ట' ప్రయుక్తము (జా. 1.119). తెలుగున 'దుప్పటి' యన ఇట్టి అర్థమే కన్పట్టును. 'జీరాడు దుప్పటి చెఱఁగు చేబూని' (ఉ.రా. 6.190).

186. పా. ధమ్మ తె. దమ్మము

'ధర్మ' అను సం. పదమే పాళీలో 'ధమ్మ'గ పరిణమించినది (ధమ్మ. వ్యా. 1-22) తెలుగున ఆ పాళీపదము 'దమ్మము'గ ఆ అర్థముననే చేరినది. 'దమ్మరాజుల కతల్ నోటి కడ్డములేక నాడివికొనుచు' (కువల. 2-114)

187. పా. ధారణ తె ధారుణి

పాళీలోని 'ధారణ'కు 'భూమి' అని అర్థము (జా. 6-180). తెలుగున 'ధారుణి' ఇట్టిదే. 'సమస్త ధారుణి ప్రజఁగూర్పఁగా' (భార. ఆది 7-128). సం.న 'ధారుణి' అను పదమే కన్పట్టదు. కాని దానిని 'ధరుణమ్' అను దాని నుండి సాధించుటకై సూ. రా. ని. ఒక విచిత్ర యత్నము చేసినది.

138 పా. ధోవతి తె. ధోవతి

తెలుగునను, పాళీయందును కట్టు గుడ్డకు వర్తించు పదమిది. పాళీలో 'ఉతికినది' అనియే దీని అర్థము (విన. 2-208). కాని తెలుగున ఉతికిన వస్త్రము అను అర్థమును పొంది మగవాడు ధరించుదానికే వినియుక్తము. పాళీ నుండి 'చీర' వలెనే ఇదియు తెలుగువారికి దక్కినది.

139. పా. నఙ్గల తె. నాగేలి; నాగలి

సం. లోని 'లాంగల' పదపు వికృతియే పాళీలోని 'నఙ్గల' అని నిఘంటు కారుని అభిప్రాయము (సంయు 1-115). ఇదియే తెలుగున చౌరబారి 'నాగలి', 'నాగేలు' అను రూపములను పొందినది.

140. పా. నిక్కిణ్ణ తె. నిక్కిన

పాళీలో 'నిక్కిణ్ణ' అనుదాని అర్థము 'ముందునకు వచ్చినది' (జా. 6-182). తెలుగున 'నిక్కిన' ఈ అర్థముననే ప్రయుక్తము. 'నిగిడినిక్కిన జాఱు నీవిఁ గన్గొను నాస' (ఉ.రా. 6-55).

141. పా. నిక్కుహ తె. నిక్కువము

పా. లోని 'నిక్కుహ'కు 'మిథ్య గానిది' అని అర్థము. తెలుగులోని 'నిక్కువము' ఆ అర్థముననే వినియుక్తము. 'నిక్కువంబింత నమ్ముము నీరజాక్షి' (భార.విరా. 2-56). సం. లోని 'నిష్కుహ' పదపు వికృతియే 'నిక్కుహ' యని నిఘంటుకారుని అభిప్రాయము.

142. పా. నిచ్చ తె నిచ్చ

'నిచ్చ' అను పాళీపదమునకు 'ఎల్లపుడు' అను అర్థము కన్పట్టుచున్నది. (మ. 1-826). తెలుగున 'నిచ్చ' అట్టి అర్థముననే ప్రయుక్తము; 'ప్రాజ్ఞుల్ నిచ్చ లోచూపులన్ గను నానందము నీవె కావె' (ఉ.రా. 3-185).

143. పా. నిట్ఠ తె నిట్ట

'నిట్ఠ' అను పాళీపదానికి 'ఎత్తు, లోపములేనిది' అను అర్థములు కల్గవు (మజ్ఝి. 1-176; ధమ్మ వ్యా. 4-70). తెలుగున 'నిట్ట' ఇట్టి అర్థమునే కలిగి

యున్నదనుట 'నిట్ట నిడుపు' 'నిట్టక నిలువు' 'నిట్టనిలుచు' ఇత్యాదులందు సుస్పష్టము; 'నిట్ట తాడనఁబొడవుచే నిక్కినాఁడు' (మనుచ. 4-73).

144. పా. నేపుణ్ణ తె. నేర్పు

'చాతుర్యము' 'ప్రజ్ఞ' అను అర్థములందు పాళీలో 'నేపుణ్ణ' వినియుక్తము (ధ. సం. 16.292; ధ. సం. వ్యా. 147). వర్ణలోప, వర్ణాగమములకు కొంతగ లోనై ఇదియే తెలుగున 'నేర్పు'గ ఆ అర్థముతోనే పరిణమించినది; 'నేరుపు మీఱఁగ వట్టివేళ్లఁ గావించిన తాళవృంతములు వీచుచునుండె' (నైష. 6.117).

145. పా. { పకతి / పకతిక } తె. { పగిది / పగిదిగ }

'పకతి' (పకతిక) అను పాళీపదమునకు ప్రకారము, రీతి - అను అర్థములు కలవు (మిళి. 220). తెలుగున 'పగిది' (పగిదిగ) ఈ అర్థముననే ప్రయుక్తము; 'భద్రద్విపంబుల పగిదిఁ బొల్చి' (భార. శల్య. 2 233).

146. పా. పక్ఖ తె. పక్క; ప్రక్క

'పక్ఖ' యను పాళీ పదమునకు శరీరపార్శ్వము, పార్శ్వము - అను అర్థములు కలవు (జా. 6.188; విన. 2.199). తెలుగున 'పక్క' (ప్రక్క) ఈ అర్థమునే కలిగియున్నది. 'కొంగ వాలునన్ బక్కలు చించి' (యయా. 2.10); 'పక్కఁ గంతి' (చెన్న. 2-29).

147. పా. పచ్ఛా తె. పజ్జ[1]

పా. లోని 'పచ్ఛా'కు 'వెనుకన' అని అర్థము. (సుత్త. 645) **సం.** లోని 'పశ్చాత్'కు ఇది వికృతి యని పండితుల అభిప్రాయము. తె. 'పజ్జ'కు ఆ అర్థమే సరికుదురుచున్నది. 'అప్పుడా వనిత పజ్జ నరిగె వాసవుండు' (భార. ఆది. 7-269).

148. పా. పజ్జ తె. పజ్జ[2]

పా. లోని 'పజ్జ'కు 'మార్గము' అని అర్థము (సుత్త 514). (ఇది 'పద్య' అను **సం.** పదపు వికృతియని నిఘంటుకారుడు), 'పజ్జ' కు తెలుగున ఈ

అర్థమే కొన్ని యెడల సరికుదురుచున్నది ; 'తన యిచ్చఁబాఱు చిత్తంబు పజ్జ నరిగి' (భార. విరా. 2-85).

149. పా. పటిమారేతి తె. పరిమార్చు

'పగదీర్చుకొనుటకై చంపుట'ను పాళీలోని 'పటిమారేతి' తెలియజేయును (జా.3-135). ఇదియే తెలుగున అదే అర్థమున 'పరిమార్చుఁ' గ చేరినది; 'దీప్త సాయక పంక్తిం బరిమార్చెద' (భార. విరా. 4-102).

150. పా. పణ్ణసన్న తె. పన్నస

పా. లోని 'పణ్ణసన్న'కు 'దత్తమగు భూమికి సరిహద్దులందు గురుతుగా నుంచిన ఆకులు' అను అర్థము కలదు (జా. 1.158); (సం.లోని 'పర్ణ సంజ్ఞ'కు ఇది వికృతి యని భావించుటకు అవకాశమున్నను, సం. లో ఆ అర్థము కన్పట్టదు) తెలుగున క్రీ. శ. ఏడవ శతాబ్ది మొదలుగ దానశాసనములందు 'పన్నస' అను పదము కన్పించుచున్నది. 'భీమేశ్వర మహాదేవరకిచ్చిన భూమి ఖ.14; ఈ పన్నసకు నైరుతిమూల' (S.I.I. 4.110). ఇచట పాళీలోని పదమే కొంత విస్తృతార్థమును పొందగా 'పన్నస' యను తెలుగుపదమునకు 'దత్తమగు భూమి' అను అర్థము కలిగినది.

151. పా. పన్త తె. పొంత

'పన్త' అను పాళీపదమునకు 'దరిదాపున' అను అర్థము కలదు (దివ్యా. 312). తెలుగున 'పొంత'కు ఈ అర్థమే కలదు. 'శంతను నందను నరదము పొంతకుఁ బోవలదు' (భార. 5-20).

152. పా. పన్తి తె. బంతి

'పన్తి' యను పాళీపదమునకు 'వరుసదీరియుండునది' అను అర్థము కలదు (విసు 392). తెలుగున 'బంతి'కి ఆ అర్థమే కలదు; 'బారు బంతి పదుపు చాల్ చాలువు పౌజు పౌఁరిది చాలు నాఁగను బంక్తికి నామములగు' (ఆం. భా. 2.34).

153. పా. పయుత్త

పా. లోని 'పయుత' అను పదమునకు 'ప్రయుక్తమైనది' అనియే అర్థము (సుత్త 711). కాని ఇది కొంత మార్పొంది 'పయుత్త'గా ప్రయుక్తమైనపుడు చీరపైన ముడివైచి వేసికొనెడి వస్త్రముగ పాళీగ్రంథములలో లెక్కకు వచ్చినది. ('మహానిద్దేస'మున 'చీవర పయుత్త' అనుదానికి 'చీరయు, దానికి అనుసంధించిన పైవస్త్రమును' అనియే వ్యాఖ్యాతలు తెలిపిరి). తెలుగున ఇది మూడు రూపములను (పయ్యద, పయ్యెద, పైట) ఆర్జించి పా. పదపు అర్థముననె ప్రయుక్తము. "ఎదలపైఁ బొదలు పయ్యెదలు జాఱఁగ" (వసు. 1. 46); 'కాంతోత్తరీయంబు పైయెద, పయ్యెఁట, పైఁట పయిట' (ఆం. భా. 2.155); 'పయ్యద' లోక వ్యవహారమున వినబడుచున్నది.

154. పా. పరిక్ఖతి తె. పరికించు

'చక్కగ పరిశీలించి చూచు'అను అర్థము పాళీలోని'పరిక్ఖతి' అను పదమునకు కలదు (అంగు. 1. 162). తెలుగున 'పరికించు' నకు ఈ అర్థమే సరికుదురును. 'ఒండు మాటలు దక్కి పసులం బరికింప నియోగింపుము' (భార. విరా. 1. 286).

155. పా. పలిఘ తె. పలుగు

పా. లో 'పలిఘ'కు 'ఇనుప కడ్డీ'యని అర్థము (విన. 2. 154). ఇది తె. లోనికి చొరబారి 'పలుగు'గ రూపొంది, 'త్రవ్వుటకు ఉపయోగించు ఇనుప సాధనము' అను అర్థమును గ్రహించినది. వ్యావసాయికులకును, మట్టిపనివారికిని ఇది సుపరిచితము.

156. పా. పలుగ్గ తె. పగులు

పా. లో 'పలుగ్గ' యన 'విరిగినది, భిన్నమైనది' అను అర్థములు కలవు (మిళి. 117). తె. లో కొంత వర్ణవ్యత్యయమును పొంది 'పగులు'గా ఆ అర్థముననే పరిణమించినది; 'కమలజాండ మట పగులన్ (భీమ.' 4. 132).

157. పా. పల్లఙ్క తె పల్లకి

పా. లోని 'పల్లఙ్క'కు 'చక్కగ ఆసీనుడగుటకు వీలైన పీఠము' అని అర్థము (విన. 2 163). తెలుగున ఇది 'పల్లకి'గ పరిణమించి, 'కూర్చుండుటకు వీలుగానుండు, మనుష్యులు మోసెడి యానవిశేషము' అను అర్థమును గ్రహించినది. 'పాలకి' అనునది దీని వికృతి 'పల్లకి పల్లకీ పాలకీ పాల్కినాఁ బల్యంకికాఖ్యలు' (ఆం భా. 2.201).

158. పా పల్లల తె. పల్లము

'పల్లల' అను పాళీపదమునకు 'నిమ్నభూమి' అని అర్థము (దివ్యా 56). కొన్ని యెడల చిత్తడినేల, చిన్నకుంట అను అర్థములును సరికుదురుచున్నవి (మ. 1.117; జా. 2.129). తెలుగున 'పల్లము' ఈ అర్థములనే తెలియజేయుచున్నది. 'ఉన్నత భూమిపై నుండలేక పల్లమున కోడిగిల్లిన పగిది' (కాశీ.3.111).

159. పా. పాళీ తె. పాడి

'పాళీ' అను పదము 'ధర్మానుశాసనము'ను తెలియజేయునని బుద్ధఘోషుని నిర్వచనము. ఈ అర్థమున విరివిగ ఈ పదము బౌద్ధ గ్రంథములందు కనబడుచున్నది (ఖు. వ్యా. 41). పిటకములందు ఈ పదమే కన్పట్టదు; కాని వాని వ్యాఖ్యానములందు మాత్రము కన్పట్టును. 'ధర్మము' అను అర్థమున ఇది తెలుగులోనికి 'పాడి'గ చొరబారినది. 'ఇత్తెఱంగు పాడిగాఁగఁ బూని పలుకగఁ జెవి యొడ్డి యాదరించువారి నందుగాక' (భార ఉద్యో. 1.23).

160 పా. పుఞ్ఞ తె. పున్నెము

సం. లోని 'పుణ్య' పదమునకు వికృతి యనదగు పాళీ పదము 'పుఞ్ఞ' (దీఘ. 1-47). ఇది తెలుగున 'పున్నెము' అను రూపమున చేరినది. 'అన్నెము పున్నెమును దేవుడె యెఱుంగు' (సారంగ. 3-82).

161. పా. పుణ్ణమ తె. పున్నమ

'పూర్ణిమ' యను సం. పదమునకు పాళీలోని వికృతి పుణ్ణమ (దీఘ. 1-47). ఇది అదేరూపమున, అదే అర్థముతో తెలుగులోనికి 'పున్నమ'గా వచ్చినది. 'పున్నమనాఁటి చందురుని చందమమరె జూడు' (భార. స్త్రీ 2-94).

162. పా. పుథవి తె పుడమి

సం. లోని 'పృథ్వి' పదము అదే అర్థముతో 'పుథవి'గా పాళీలో కన్పట్టుచున్నది (జా. 1-14); తెలుగున ఆ అర్థముతోనే 'పుడమి'గ ఇది రూపొందినది. 'పుడమి తిలతండుల న్యాయమున వెలుంగ' (మనుచ. 2-7).

163. పా. పుల్లింగ తె. పుల్లింగాలు

'స్ఫులింగ' అను సం. శబ్దమునకు వికృతి యనదగినది పాళీలోని 'పుల్లింగ'; దీని అర్థము. 'కొరవి' (జా. 5-143). తెలుగున 'పుల్లింగాలు' అను మాట వినబడుచున్నది. 'పుల్లింగాలు పెట్టుట' అన 'లేనిపోనివి చెప్పి ఇరువురి మధ్య వైరమును కల్పించుట' అని అర్థము. కావ్యములందు మాత్రము దీనికి ప్రయోగము కన్పట్టదు.

164. పా. పూగ[1] తె. పోఁక

పా. లోని 'పూగ' పోక చెట్టునే తెలియజేయును (జా. 5-37). ఇదియే తెలుగులోనికి 'పోక'గ వచ్చిచేరినది. ఉచ్చారణలోని మార్పువలన అర్థానుస్వారము చేరినది; పూచిన యొక్క పోఁక నునుబోదియ' (మనుచ. 2-29.)

165. పా. పూగ[2] తె. పోగు; ప్రోగు

'పూగ' అను పాళీ పదమునకు 'రాశి' అని అర్థము. (చు. ని. 452). తెలుగున ఆ అర్థముతోనే 'పోఁగు'గ ఇది పరిణమించినది. 'పెంటపోగు' వంటి ప్రయోగములు వ్యవహారమున కలవు; 'ప్రోగు' ఈ పదపు వికృతియే అగును; 'విరాలి కల్కి ప్రోగుల కనుగుట్టు' (రా. వి. 3-8).

166. పా పేటక తె. పెటకము

'పేటక' అను పాళీ పదము ఆ పేరుగల ఒక గ్రంథమును సూచించును (విసు. 141) క్రీస్తు శకారంభకాలమున ఇది రూపొందియుండునని పండితులలో పలువురి అభిప్రాయము. బౌద్ధ ప్రామాణిక గ్రంథములందలి విషయములపై పూర్వపక్ష, సిద్ధాంతములు ఇందు కలవు. సాధారణులకు ఇది విసుగును కలిగించును బౌద్ధము అంతరించిన తరువాత కూడ ఈ పదము తెలుగున నిలిచి, 'విసుగును బాధను కలిగించు విషయము' అను అర్థమున లోకవ్యవహారమున కన్పట్టుచున్నది.

167. పా. పేళ[1] తె పేళ్ళగంప

'పేళ' అను పాళీ పదమునకు 'గంప' అనియే అర్థము (దివ్యా. 508). తెలుగున ఇది యథాతథముగ వచ్చిచేరి, 'గంప' యను దేశిపదమును కూడ చేర్చుకొనినది (పేపరు కాగితము వంటి పదమిది) పెండ్లిండ్లలో వధువును కొనివచ్చు గంపను 'పేళ్ళగంప' యనుట లోకవ్యవహారమున కలదు.

168. పా. పేళ[2] తె పెళ్ళ

పా. లోని 'పేళ'కు 'ముద్ద' లేదా 'పిండము' అని అర్థము (సుత్త. వ్యా. 247). తెలుగున 'పెళ్ళ'గ ఇది ఆ అర్థముననే పరిణమించినది. ముఖ్యముగ 'మట్టిగడ్డ' అను అర్థమున కావ్యములందు ప్రయుక్తము. 'దిగ్భిత్తులం బెల్లల్ రాలెడు' (భా రా.యు 1018)

169. పా. పొత్తక తె. పొత్తిక

'పొత్తక' అను పాళీ పదమునకు' ఒక విధమగు నారతో చేయబడిన వస్త్ర విశేషము' అని అర్థము (విన. 1.306). ఇదియే తెలుగున 'పొత్తిక'గ రూపొంది నది. 'బొమ్మపొత్తికలకుం దెండీ' (భార.విరా. 4.47). ఈ పదమును **సం.** లోని పుత్రికనుండి సాధించుటకు **సూ. రా. ని.** వ్యర్థయత్నము చేసినది.

170. పా. పోసేతి తె. ప్రోచు

'పోసేతి' అను పాళీ క్రియకు 'పోషించు' అని అర్థము (విన. 1. 269); తెలుగున 'ప్రోచు'నకు ఆ అర్థమే కలదు. 'శారద సతతంబుఁ బ్రోచు జన్నయ సిద్ధున్' (విక్ర. 1. 6)

171. పా. బుజ్ఝతి తె. బుజ్జగించు

'బుజ్ఝతి' కి పాళీలో 'తెలియజెప్పు' అని యర్థము (విసు. 209). తెలుగున 'బుజ్జగించు' నకు 'ఉపలాలనము' అను అర్థము ఎక్కువగ వ్యాప్తిలో ఉన్నను 'తెలియజెప్పుట' యనునదియు కొన్ని యెడల సరికుదురుచున్నది. 'రుమను శోక ముడుగగఁ గృతమతిఁ బోధించి బుజ్జగింపుడు మీరల్' (భా. రా. కిష్కిం 68). తొలుత ఈ అర్థమే యుండి, కాలక్రమమున అర్థవిస్తృతిని ఆర్జించి, 'ఉప లాలనము'గ ఇది లెక్కలోనికి వచ్చియుండును.

172. పా. బిల తె. బిళ్ళ

'బిల' యను పాళీ పదమునకు 'ముక్క' అని యర్థము (జా 6. 153). తెలుగున 'బిళ్ళ' ఇట్టిదియే. 'కల్లు బిళ్ళలు చేసి వెగ్గలము నవ్వె' (ఉ హరి. 3.99).

173. పా. బొంది తె. బొందు; బొంది

పా. లోని 'బొంది' యను పదపు అర్థమును గురించి పాళీ పండితుల లోనే భిన్నాభిప్రాయాలు కలవు. 'బంధించునది' అని ఒకరి అభిప్రాయము. ఈ అర్థమున తెలుగున 'పూవులలోనున్న బొందువోలె' (కాశీ. 5. 96) అను ప్రయోగము కన్పడును. ఇచట 'బొంది' 'బొందు'గ మారినది. ఇక కొందరు పాళీ పండితులు 'బొంది'యన 'శరీరము' అనిరి. ఈ అర్థమున ఈ పదము తెలుగున విరివిగ వ్యాప్తిలో ఉన్నది. 'బొంది తోడనె కూడఁ బోయి స్వర్గంబు' (రం. రా. బాల. 58).

174 పా. భక్ఖతి తె. బొక్కుట

సం. లోని 'భక్షతి' యే 'భక్ఖతి'గ పాళీలో నిలిచినది. 'తినుట' అని దీని అర్థము (మిళి. 233). తెలుగున 'బొక్కుట'గ ఆ అర్థముననే ఈ పదము పరిణమించినది 'తునుకలు చేసి బొక్కుచు' (రామా. 3.150)

175. పా. భణతి తె. భణితి

'భణతి' అను పాళీ పదమునకు 'గట్టిగ పలుకుట' అని అర్థము (ధమ్మ. వ్యా. 2.95). తెలుగున పాటను నేర్చుకొనువారు ఈ పదమును సాధారణముగ 'పలికెడి తీరు'ను తెలుపుటకు వాడెదరు. కావ్యములందు ప్రయోగము కన్పట్టదు.

176. పా. భణ్డు తె. బట్ట (తల)

పా. లోని 'భణ్డు'నకు 'వెంట్రుకలు మొలవనితల' అని అర్థము కలదు (విన 1.71). (సం. న దీనికి అట్టి అర్థము కన్పట్టదు). తెలుగున 'బట్టతల' అనుదానిలోని 'బట్ట'అను విశేషణము 'భణ్డు' నుండి వచ్చిన వికృతిగనే భావింప దగియున్నది. వేరు తీరున దానిని వివరించుట సాధ్యము కాదు.

177. పా. భము తె. బొమ

సం. లోని 'భ్రూ' అను దానికి ఒక విధపు వికృతి పా. లోని 'భము' అని ఒక పండితుని అభిప్రాయము (జా. 6.470). 'భాముక' అనునది (భ్రూముఖ అనుదాని నుండి) పాళీలో తొలుత రూపొంది, క్రమముగ 'భము'గ మార్పొందెనని అతడనెను. ఇది ఎటులున్నను అర్థములు సమానములే. తెలుగున 'కనుబొమ'లోని 'బొమ' పా.లోని 'భము' నుండియే వచ్చినది. కాని స్పష్టతకై 'కను' అనునది దానికి జతపెట్టబడినది.

178. పా. మక్ఖ తె. మక్కు

'మక్ఖ' అను పాళీ పదమునకు 'పైన పూతగ పట్టించినది' అని అర్థము (మ. 1.16). తెలుగున 'మక్కు' ఆ అర్థముననే ఇది వాడుకలో ఉన్నది. అంతే కాదు; కొంత విస్తృతార్థమును గ్రహించి, 'మాసినది' అను అర్థమును కూడ సంతరించుకొనినది; 'మక్కు, మాసినది నా మలినంబు విలసిల్లు' (ఆం.భా.315).

179. పా. మఙ్కు తె మంకు (తనము)

'మఙ్కు' అను పాళీ పదమునకు 'మొండిగ, తెలివిలేమితో వ్యవహరించు' అని అర్థము (విన. 2. 118). తెలుగున 'మంకుతనము'న 'మంకు' ఆ అర్థమునే సూచించును; 'మాయా మృగము వెంట మగడు పోవఁగ వెంట మఱదిఁ బాపిన నాటి మంకుతనము' (కృ శతకం. పీఠి. 1. 50.)

180. పా. మచ్ఛర తె. మచ్చర

'మచ్ఛర' అను పదము సం. లోని మత్సరమునకు సమానార్థకము (సుత్త. 811). తెలుగున యథాతథముగ ఆ అర్థముతోనే చొరబారినదది. 'శాంతి నిప్పచ్చరంబు మచ్చరము ఘనము' (భీమ. 1. 13).

181. పా. మరియాద తె. మరియాద

సం లోని 'మర్యాద'తో సమానార్థత కలది పా. లోని మరియాద (విన. 3. 50) ఇది యథాతథముగా ఆ అర్థముననే తెలుగులో ప్రవేశించినది; 'మరియాదఁ దప్పిమెలఁగినఁ బురుషార్థంబునకు హాని పుట్టక యున్నే' (భార. విరా. 1. 122).

182. పా. మరుమ్బ తె. మొరము; మొరుమ

పా. లోని 'మరుమ్బ' కు 'ఒక విధపు గులకరాతిమట్టి' అని అర్థము (విన.2.121). తెలుగులోని 'మొరము' అట్టిదియే; 'మృదుశయ్యపైనున్న మెలత పల్లేరు ముండ్లు దట్టంబైన మొరపనేల' (ప్రభులిం. 2.84).

183. పా. మల్లక తె. మల్ల, మొల్ల

'మల్లక' యనునది 'పాత్ర విశేషము'నకు పా. లో నాడబడినది (జా. 3.21). తెలుగున 'మల్ల; మొల్ల' అను రెండు తీరులలో భోజనపాత్రను తెలియ జేయుటకై ఇది వ్యవహారమున వాడుకలో ఉన్నది; కావ్యములందు ప్రయోగ ములు కానరావు.

184. పా. మానిక తె. మానిక

'మానిక' యనునది ఒక ప్రత్యేక ప్రమాణముగల 'కొలపాత్ర'గ పాళిలో వ్యవహృతము (సుత్త. వ్యా. 476). తెలుగున లోకవ్యవహారమునను, కావ్యము లందును ఆ అర్థముననే అది వినియుక్తము; 'కుడపాభిధానమై యలరు నవని మాన నా ముంత నా మానిక యన' (ఆం.భా. 2.270).

185. పా. మిగ తె. మెకము; మెగము

సం. లోని 'మృగ' కు వికృతి పా. లోని 'మిగ' (జా 5.416). తెలుగున ఇది 'మెక'ము (మెగము) గ మార్పొంది ఆ అర్థమునే కలిగియున్నది; 'చెఱువు నడుమవిసినను బెనువెఱ మెకములు సెదరినను' (భార. శాంతి. 3.16).

186. పా. మిల్హ తె. మైల

పా. లోని 'మిల్హా' కు 'అశుద్ధ''మని అర్థము (మ. 1.454); తెలుగున 'మైల' యు దాదాపుగ అట్టిదియే; 'నేఁ బ్రాకట భూసుర కన్యక నీ కట్టిన, మైలఁ గట్టనేర్తునె యనినన్' (భార. ఆది. 3.135)

187. పా. మిలాచ తె. ములుచ(దనము)

సం. లోని 'మ్లేచ్ఛ'కు వికృతియే పా. లోని 'మిలాచ' అని నిఘంటు కారుని అభిప్రాయము. 'ఆర్యేతరుడు, మూర్ఖుడు, అనాగరికుడు' అను అర్థము

177. పా. భము తె. బొమ

సం. లోని 'భ్రూ' అను దానికి ఒక విధపు వికృతి పా. లోని 'భము' అని ఒక పండితుని అభిప్రాయము (జా. 6.470). 'భాముక' అనునది (భ్రూముఖ అనుదాని నుండి) పాళీలో తొలుత రూపొందె, క్రమముగ 'భము'గ మార్పొందెనని అతడనెను. ఇది ఎటులున్నను అర్థములు సమానములే. తెలుగున 'కనుబొమ'లోని 'బొమ' పా.లోని 'భము' నుండియే వచ్చినది. కాని స్పష్టతకై 'కను' అనునది దానికి జతపెట్టబడినది.

178. పా. మక్ఖ తె. మక్కు

'మక్ఖ' అను పాళీ పదమునకు 'పైన పూతగ పట్టించినది' అని అర్థము (మ. 1.16). తెలుగున 'మక్కు' ఆ అర్థముననే ఇది వాడుకలో ఉన్నది. అంతే కాదు; కొంత విస్తృతార్థమును గ్రహించి, 'మాసినది' అను అర్థమును కూడ సంతరించుకొనినది; 'మక్కు, మాసినది నా మలినంబు విలసిల్లు' (ఆం.భా.815).

179. పా. మఙ్కు తె మంకు (తనము)

'మఙ్కు' అను పాళీ పదమునకు 'మొండిగ, తెలివిలేమితో వ్యవహరించు' అని అర్థము (విన. 2. 118). తెలుగున 'మంకుతనము'న 'మంకు' ఆ అర్థమునే సూచించును; 'మాయా మృగము వెంట మగడు పోవఁగ వెంట మఱదిఁ బాపిన నాటి మంకుతనము' (కృ శకుం. పీఠి. 1. 50.)

180. పా. మచ్ఛర తె. మచ్చర

'మచ్ఛర' అను పదము సం. లోని మత్సరమునకు సమానార్థకము (సుత్త. 811). తెలుగున యథాతథముగ ఆ అర్ధముతోనే చొరబారినదది. 'శాంతి నిష్పచ్చరంబు మచ్చరము ఘనము' (భీమ. 1. 13).

181. పా. మరియాద తె. మరియాద

సం లోని 'మర్యాద'తో సమానార్థత కలది పా. లోని మరియాద (విన. 3. 50) ఇది యథాతథముగా ఆ అర్థముననే తెలుగులో ప్రవేశించినది; 'మరియాదఁ దప్పిమెలఁగినఁ బురుషార్థంబునకు హాని పుట్టక యున్నే' (భార. విరా. 1. 122).

(అం.ఖా. 1-50). తెలుగున దీనికే 'రక్కెస' యను రూపమును కలదు. అది విశేషణముగ సైతము ప్రయుక్తము, 'రక్కెసమాట లాడెదరు రాజును దమ్ములు' (భార. ఉద్యో. 3 94).

191. పా. రచ్ఛా తె. రచ్చ

సం. లోని 'రథ్య' యను పదపు వికృతియే పాళిలోని 'రచ్ఛా'యని నిఘంటుకారుని అభిప్రాయము. 'బండ్లబాట' యని అర్థము (విన. 2-194). తెలుగున ఈ పదము 'రచ్చ'గ చేరి, కొంత విస్తృతార్థమును పొంది 'పెక్కురు కలసి చర్చించు స్థలము' అను అర్థమును పొందినది. తొలుత ఇట్టి సమావేశములు పలువురు నడచెడి బాటల ప్రక్కన జరుగుటవలన ఇట్టి అర్థ విస్తృతి జరిగి యుండును.'రాజమార్గంబున రచ్చలందు మూత్రపురీషపు విమోచనంబు సేయమి' (భార. శాంతి. 4-117). దీనినుండియే రచ్చపట్టు మొ॥నవి రూపొందినవి.

192. పా. రిత్త తె. రిత్త

సం. లోని 'రిక్త'కు వలెనే పా. లోని 'రిత్త'కును 'ఫలశూన్యపు' అను అర్థము కలదు(జా. 1-29). తెలుగున యథారూపముననే ప్రవేశించి, ఆ అర్థమునే ఈ పదము'కలిగియున్నది;'విత్తు సహకారి గాకున్న రిత్తనేల' (భార. అను.256). క్రమముగ దీనికి 'అబద్ధోక్తి' అను అర్థమును కలిగినది.

193. పా. లఞ్చ తె. లంచము

సం. న 'లఞ్చః' అను పదము కలదు. దానికి వ్యాప్తి చాల తక్కువ. బహుశః పాళినుండియే అది సం. లోనికి చేరెనేమో! ఇక పా. లో 'లఞ్చ' అనుదానికి 'కార్యసాధనకై ఒకనికి అక్రమరీతిలో రహస్యముగ చెల్లించునది' అని అర్థము (జా. 1.201). తెలుగున యథారూపమున, అదే అర్థమున ఈ పదము చేరినది; 'లంచంబుగొని సాక్షి వంచించి యనృతంబు వలికెడి పాపాత్ము' (భాగ. 5.155)

194. పా. లగుళ తె లగువు

'లఘు' అను సం. పదమునకు సన్నిహితము పా. లోని 'లగుళ'; 'చురుకుదనము' అని దాని అర్థము (అంగు. 1.10.45). తెలుగున 'లగువు'అను

రూపమును పొంది అదే అర్థమును అది కలిగియున్నది; 'జరి లావు లగువుంగల పోటరివోలెఁ బ్రేలెదే' (భాగ. 10. ఉ. 896).

195. పా. వగ్గు తె. వగ్గు (పాట)

పా. లో 'వగ్గు' అన 'సుమధుర' అను అర్థము కలదు (జా.2.439). 'వగ్గువాద' యన 'మధురవాద' అను అర్థమును నిఘంటుకారులు ఇచ్చిరి. తెలుగులోని 'వగ్గుపాట' లోని 'వగ్గు' ఇదియే కావచ్చును. (పా. లోని 'వగ్గు' **సం**. లోని 'వల్గు' నుండి వచ్చియుండునని ఒక నిఘంటుకారుని అభిప్రాయము; అది సమంజసముగ కన్పట్టదు.)

196. పా. వఙ్క తె. వంక

పా లోని 'వఙ్క'కు 'వంగి'న అని అర్థము (మ. 1.31). (**సం.** లోని 'వక్ర'కు వికృతి ఇది అని నిఘంటువు). తెలుగులో ఇది యథారూపమున ప్రవేశించి విశేష్యముగ మారినది; 'కుబ్జ మువ్వంకల యొడలు సక్కఁగ నొత్తి' (భాగ. 10. పూ. 1277); ఇదియే గమనరీతిని బట్టి 'సెలయేఱు'నకు 'చిన్న వాగు'కు పర్యాయపదమైనది.

197. పా. వచ్చ తె. ఉచ్చ

పా. లో 'వచ్చ' యన 'మలమూత్రములు' అను అర్థము కలదు (విన. 2. 112). తెలుగున ఇది 'ఉచ్చ'గ పరిణమించి 'మూత్ర'మునకే వినియుక్తము.

198. పా. వడ్ఢకి తె. వడ్రంగి; వడ్ఢగి

కర్రపని చేయువానిని పా. లో 'వడ్ఢకి' అనెదరు (జా. 1. 32). తెలుగున అదే అర్థమున 'వడ్రంగి' 'వడ్ఢగి' అను రూపములను ఇది పొందినది; 'వాలి యాడించు నా వడ్రంగి యతఁడు' (బస. పు. 465).

199. పా. వడ్ఢి తె వడ్డి

సం.లోని 'వృద్ధి'కి సమానార్థకము పా లోని 'వడ్ఢి'. 'అప్పు తీసికొనిన వాడు అధికముగ చెల్లించు మొత్తము' అని దాని అర్థము (సుత్త. వ్యా. 179). తెలుగున 'వడ్డి'గ ఇది చేరి, ఆ అర్థమునే కలిగియున్నది.

200. పా. వణ్ణ తె. వన్నె

సం.లోని 'వర్ణ' పదపు అర్థమే ('రంగు' అనునది) పా.లోని 'వణ్ణ'కును కలదు (సుత్త. 447), తెలుగున 'వన్నె'గా ఇది పరిణమించి, ఆ అర్థముననే ప్రయుక్తము; 'ధరణీ గుల్మలతావితానము పల్లవములకుఁ గట్టెఱ్ఱవన్నె యొసగి' (భార. ఉద్యో. 2 114). పాళిలో 'వణ్ణ'కు 'ప్రాశస్త్యము','సౌందర్యము' మొదలగు విస్తృతార్థములు కలవు; తెలుగునను 'వన్నె'కు అట్టివి కన్పట్టుచున్నవి.

201. పా. వణ్ణియ తె. వన్నియ

'వర్ణము కలది' అను అర్థము పాళిలోని 'వన్నియ'కు కలదు. (మ. 1 446). తెలుగున 'వన్నియ'కును ఈ అర్థమే సరికుదురును; 'కలవె పలువన్నియల గిడ్డి కదుపు లనుచు' (నీలా. 1.26); 'రంగుపూత' అను అర్థమును శ. ర. ఈ పదమునకు ఇచ్చినది కాని ఎడనెడ దీనిని 'వన్నె'కు పర్యాయపదముగ వాడుటయు తెలుగున జరిగినది.

202. పా. వత్థ తె. బట్ట

పా. లోని 'వత్థ'కు 'వస్త్ర'మనియే అర్థము (మ. 1.86). తెలుగున ఆ అర్థముననే ఇది 'బట్ట'గ పరిణమించి లోకవ్యవహారమున వాడుకను ఆర్జించినది.

203. పా. వద్ధ తె. బద్దె

'తోలు మొదలగు వానితో చేసిన త్రాడువంటి చీలిక' అని పాళిలోని 'వద్ధ'కు అర్థము (జా. 2.154). సం.లో 'వర్ధ్రి'కు ఇది వికృతియని నిఘంటువులో కలదు. పాళీ పదమే తెలుగున 'బద్దె'గ పరిణమించినది. తెలుగున 'బద్దె' అనునది 'అంచు'నకు వాడబడుటయు కలదు.

204. పా. వసభ తె. బసవ

సం.లోని 'వృషభ' పదపు వికృతియే పాళిలోని 'వసభ' (మిళి. 118). తెలుగున 'బసవ' పదము పాళీ 'వసభ' నుండియే పరిణమించినది; 'బసవఁడు అంకెవైచి హిమపర్వత సాను వనాంతరంబులన్' (హర. 8.32).

205. పా. వాట తె. వాడ

'వాట' యన 'ప్రజలు వసించు చోటు' అని అర్థము (విసు. 256). బ్రాహ్మణవాట ఇత్యాది ప్రయోగములు పాళీలో కన్పట్టుచున్నవి. తెలుగున 'వాడ' ఇట్టిదియే. 'అవ్వాడం బౌరజనంబులెల్ల నితఁడెవ్వాఁడొకో' (నైష. 3.82).

206. పా. వాల తె. వాలు, వాల్

'వాల'యను పాళీ పదమునకు 'క్రూరమైన' అని అర్థము (విన. 2.299) తె. న 'వాలు' నకు వ్యస్తముగ ఇట్టి అర్థము లేకున్నను 'వాల్మెకము' అనునపుడు ఈ అర్థమే సరికుదురుచున్నది. 'వాల్మృగంబుల ఘోరవనమని' (భార. ఆది. 6. 176). వాలువైరులు, వాల్మెకములు మొదలగు వానియందును ఈ అర్థమే తగియున్నది. 'వాలు' అను విశేషణము, విశేష్యముగ పరిణమించి 'కత్తి' అను అర్థమును సంతరించుకొనెనా యనునది విచారింపదగినది; 'వాలు' అనునది క్రియగ 'విజృంభించు' అను అర్థమును తెలుగున కలిగియున్నది.

207. పా. వికట తె. వికట

'వికట' అను పాళీ పదమునకు 'చెడగొట్టబడినది' లేదా 'చెడురీతిగా చేయబడినది' అను అర్థము కలదు (పంచ. 63). సం. న ఈ పదము ఉన్నను అది పాళీనుండియే సం. లోనికిపోయినది. ఈ పదము ఆ అర్థముననే తెలుగులోనికి ప్రవేశించినది. అంతేకాదు; 'వికటించు' అను క్రియయు దీనినుండి రూపొందినది. పా. లో 'అకట' అను పదము కలదు; దానికి 'చేయనిది' అను అర్థము కలదు. ఈ 'అకట, వికట' పదములు సంయుక్తముగజేరి తెలుగున 'అకట వికటము' అను పదము వాడుకలోనికి వచ్చినది. 'చేయడు, చేసినదో పాడుచేయును' అని దీని అర్థము; 'అడ్డ దిడ్డము' అని భావార్థము. 'అకట వికటంబులగు ప్రశ్నలడిగెఁగొన్ని' (శా. రా. 2. 152). తెలుగున నిర్వేదార్థకముగ వాడబడు 'అకటా' అనుదానికిని 'అకట'కును గల సంబంధము ఆలోచింపదగినది.

208. పా. విఞ్ఞాణ తె. విన్నాణము

బౌద్ధమున 'విఞ్ఞాణ' పదము 'వ్యక్తికి ఒక ప్రత్యేకతను కలిగించు మానసిక స్థితి' అను తాత్త్వికార్థమున తొలుత ప్రయుక్తము. కాని కాలక్రమమున 'వ్యక్తియందు కన్పట్టు మానసిక ధాతుసంపత్తి' అను అర్థము కలిగినది (విభం. వ్యా).

తెలుగున ఈ పదము 'విన్నాణము'గ రూపొంది 'విద్యాకుశలత'అను అర్థమును గ్రహించినది; 'ప్రళయాగ్నుల క్రియఁబోరిరి బహువిధములైన విన్నాణములన్' (భాగ. 10.పూ. 1346).

209. పా. విలుగ్గ తె. విఱుగు

'విలుగ్గ' అను పాళీపదమునకు 'భగ్నమైన' అని అర్థము (మ.1.80). తెలుగు 'విఱుగు' ఇట్టిదియే. ఉచ్చారణలోని మార్పు వలన శకటరేఫ వచ్చి యుండును. పాళీలోని విశేషణము ఇచట క్రియాపదముగ మారినది; 'విఱిగిన' అనునది విశేషణము; 'విఱిగిన దండంబు, దునిసి వ్రేలెడు గోచిన్' (ఉ. హరి. 4.78).

210. పా. విలార తె. ఇలారము

'విలార' అను పాళీ పదమునకు 'పిల్లి' అని అర్థము (అంగు. 3.122). **సం.** లో 'బిడాల' ఈ అర్థమునే సూచించును. పాళీ పదము ఆ అర్థముననే, తెలుగులోనికి 'ఇలార' గ వచ్చినది. 'ఇల్లు ఇలారము' అను నానుడిలో ఇలారము ఈ అర్థమునే సూచించును. ఈ నానుడియే కొన్ని ప్రాంతములందు 'ఇల్లు, పిల్లికూన' అని మారినది. 'ఇలార'పు అర్థమును గుర్తింపనేరక దానిని 'ఇలువర'పు పర్యాయ రూపముగ భావించి శ.ర. పొరపడినది; సూ.రాని. ఆ పొరపాటును అనుసరించినది

211. పా. విసూక తె. విసుగు (విసువు)

'విసూక' అను పాళీ పదమునకు 'మనసు కుదుటబడక యుండుట' అని అర్థము (మ. 1.8). ఇదియే దాదాపుగ ఆ అర్థముననే తెలుగున 'విసుగు' (విసువు) గ పరిణమించినది; 'విసువొక్కింతయు లేక రాల్పవలయున్' (కాశీ. 2.72).

212. పా. విహేథన తె వేధించు

'విహేథన' యన 'బాధించుట, కష్టపెట్టుట' అని అర్థము (విభం. వ్యా. 74). తెలుగున 'వేధించు' ఈ అర్థమునే కలిగియున్నది; 'మహిమన్ వేధించి సర్వామరస్తోమ త్రాసము మాన్పబంపునది' (వరాహ. 12 50). లోకవ్యవహా

రమునందును ఈ అర్థముననే ఈ పదము వ్యాప్తిలో నున్నది సూ. రా. ని. దీనిని **సం**. లోని 'విద్' ధాతువునుండి రూపొందించ విఫలయత్నము చేసినది.

213. పా. వేత్త తె. బెత్తము

**సం** లోని 'వేత్ర' శబ్దపు వికృతియే పా. లోని 'వేత్త'; పేముకర్ర అని దీని అర్థము (మిళిం. 196) తెలుగున 'బెత్త'ము ఇట్టిదియే; 'బెత్తమంచ నఁగను వేత్రమలరు' (ఆం. బా.262).

214. పా. వేజ్జ తె. వెజ్జు (వెజ్జ)

'వేజ్జ'యను పాళీపదమునకు 'రోగములను కుదుర్చువాడు' అని అర్థము (జా. 1-455). తెలుగునందలి 'వెజ్జు'నకును అర్థమదియే; 'నాగులు చిత్త వృత్తి నొవ్వఁదీర్ప వెజ్జు పీవెకావె' (భార. ఉద్యో. 3-26).

215. పా. వేర తె. వేరము (వేరిమి)

సం. లోని 'వైర' పదమే పా. లో 'వేర' గ రూపొందినది. 'పగ' యని దీని అర్థము (జా. 4-71). తెలుగున 'వేరము' (వేరిమి) ఈ అర్థముననే ప్రయుక్తము; 'వీరును బాండుపుత్రులును వేరముఁ దక్కి పొసంగ మన్కి' (భార. ఉద్యో. 4-3); 'వేరిమి ధర్మజుం బరిభవించిన ద్రోహులు' (భార. ఉద్యో 3-74).

216. పా. సక్ఖలి **తె.** చక్కిలము

'సక్ఖలి' యన ఒక విధమగు భక్ష్యము (జా. 2 28). తెలుగు చక్కిలము ఇట్టిదియే, 'భక్షించె నాగ్రహమునఁ జెఱకు శర్కరఁ బాకంబు సేసినట్టి చక్కిలముఁ బోలెఁ జట చట శబ్దమొప్ప' (భీమ. 657).

217. పా. సఙ్ఖలా తె సంకెల

పాళీలోని 'సఙ్ఖలా'కు 'గొలుసు' అని అర్థము (థేరీ. 2.509). **సం**.లోని 'శృంఖల' ఇట్టిదియే పాళీ పదము అదే అర్థమున తెలుగున 'సంకెల' గ పరిణమించి, లోకవ్యవహారమునను కావ్యములందును ప్రయుక్తము; 'నందగోపునిం బట్టి పెక్కు సంకెలలం బెట్టుఁడు' (హరి.పూ. 7.136) తెలుగున ఈపదమునకే సంకిలి, సంకలియ, సంకిలయ అను వికృతులును కనవచ్చుచున్నవి.

218 పా. సఙ్గతి తె. సంగతి

పాళీలోని 'సంగతి'కి 'ఘటన' అను అర్థము కలదు (దీఘ. 1.58). సం.లో ఈ పదమునకు ఈ అర్థమున విరివిగ ప్రయోగము కనప్పట్టదు. కావున ఇది ఈ అర్థమున పాళీనుండియే తెలుగులోనికి చొరబారియుండును. తెలుగున నైనను లోకవ్యవహారమున మాత్రమే ఈ అర్థమున ఈ పదము ప్రయుక్తము. (ఉదా : ఈనాటి పత్రికలోని సంగతులు తెలిసినవా?). కావ్యములందు ఇట్టి అర్థమున ప్రయోగములు కనప్పట్టకున్నవి.

219. పా. సచ్చకార తె. సంచకరము; సంతకర్వు; సంతకరువు; సంచకారము

ఒక వస్తువును కొనుటకు ఒప్పుకొనినపుడు ఆ ఒప్పుదలను ధ్రువీకరించుటకు కొనుగోలుదారు అమ్మినవానికి లాంఛనప్రాయముగ చెల్లించు చిన్నమొత్తమును 'సచ్చకార' అని పాళీలో వ్యవహరించిరి (జా. 1.12). సం. లోని 'సత్యంకార' ఇట్టిదియే. పాళీ పదము తెలుగులోనికి 'సంచకర'గా ప్రవేశించి, తరువాత కొన్ని మాండలిక భేదములను పొందినది. దీనికై ఆంధ్రదేశమున కొన్ని ప్రాంతములవారు ఈ కాలమున ఉర్దూ పదభవమగు 'బయానా'ను, ఆంగ్ల పదమగు 'అడ్వాన్సు'ను ఉపయోగించుచున్నను 'సంచకర' పదము కొన్ని మాండలిక భేదములతో పశ్చిమ తెలంగాణా, రాయలసీమ, ప్రకాశం జిల్లాలలో వాడుకలో నిలిచినది. 'సంచకర్వు' 'సంచకారము' అను రూపములతో కావ్యములందు ప్రయోగములును కలవు. 'వనిత నీ చిత్తమున కేను వత్తునేని కామతంత్రంబునకు సంచకర్వుగాఁగఁ జుంబనము సేయనిమ్మ' (శివరాత్రి. 2 68) 'కోడెగాంద్ర గమికె తన జగ్గుజిగి సంచకారమొసఁగి' (హంస. 1.15).

220. పా. సఞ్ఝా తె. సంజ

సంధ్యా కాలమును పాళీలో 'సఞ్ఝా' అని వ్యవహరించిరి (విమా.వ్యా. 4 12). తెలుగున ఆ అర్థముతోనే 'సంజ'గ అది పరిణమించినది, 'సంజఁ బ్రియుఁ బాసి వగనొక్క చక్రవాకి' (మనుచ. 316).

221. పా. సణ్ణ తె. సన్న

సం. లోని సంజ్ఞకు వికృతియే పా. లోని సణ్ణ (విన. 1.13). తెలుగున యథారూపమున అది ఆ అర్థముననే ప్రవేశించినది; 'బోంట్ల సన్నల వెసకొల్పుచుం గెలన నవ్వొరి ధర్మజ భీమ ఫల్గునుల్' (పారి. 5.81).

222 పా. సణ్హా తె. సన్న (ని)

'సణ్హా' అను పాళీపదమునకు 'లలితము' అను అర్థము కలదు. (థేరీ. 258). ఈ పదము సం. లోని 'శ్లక్ష్ణ' పదమునుండి రూపొందేనేమో అని ఒక నైఘంటికుని అభిప్రాయము తెలుగులోనికి పాళీపదమే 'సన్న'గ జేరి, దాదాపు ఆ అర్థమునే కలిగియున్నది; 'పలుచని సన్నగాలి వలిపంబులు గట్టగ నిచ్చి' (విక్ర. 1.136).

223. పా. సత్తు తె. సత్తు

ఆహారమునకు పనికివచ్చు ఎట్టి గింజల పిండినైనను 'సత్తు' అని పాళీలో అనెదరు. (విన. 2.116) సం. లోని 'సక్తు'కు ఇది సన్నిహితము. పాళీ పదము అదే అర్థమున, అదే రూపమున తెలుగులోనికి ప్రవేశించినది; 'పిష్టంబు పిండినా సత్తునా వెలయుచుండు' (ఆం భా. 2.254).

224. పా. సద్ద తె. సద్దు

సం. లోని 'శబ్ద' శబ్ద భవము 'సద్ద'; 'ధ్వని' అని దాని అర్థము (దీఘ. 1.79), ఇది అదే అర్థమున కొలదిగా రూపవికృతితో 'సద్దు'గ తెలుగున ప్రవేశించినది; 'సద్దు నలికిడి చప్పు దలికిడనగ శబ్దం చొప్పు' (ఆం. భా. 1.12)

225. పా. సన్థన తె. సంతన

'సన్థన' అను పాళీ పదము సం.లోని 'సాంత్వన' మునకు సన్నిహితము కానగునని ఒక నిఘంటుకారుడు. పాళీపదమునకు 'సంతృప్తి' అని అర్థము (విమా. 18) తెలుగున 'సంతన' దాదాపుగ ఇట్టిదియే. పాళీలోని అర్థమే తెలుగున విస్తృతిని పొంది 'చక్కని అమరిక' అను అర్థమును పొందినది. 'సంతన కట్టి యుత్సాహసమేతులై యంతంబులేని రథాశ్వమలను' (భార. ఆది 2. 21); 'ఇంటిలో సంతన బాగుగలేదు' అను వ్యావహారిక ప్రయోగమునను ఈ అర్థము సరికుదురుచున్నది.

226. పా. సన్థర తె చదర

పాళీలోని 'సంథర' ఒక విధపు 'చాప'ను తెలియజేయును (విన. 2. 162) తెలుగున 'చదర' ఇట్టిదియే. దీనిని **సం.** లోని చతుర్‌స్ర' పదపు తద్భవముగ **సూ.రా.ని.** పేర్కొని పొరపడినది.

227. పా. సన్థరతి తె. సంతరించు

'సన్థరతి' అను పాళీ క్రియా పదమునకు 'పరచుట', చాపను 'పరచుట' అను అర్థములు కలవు (విన. 2. 120; దీఘ 2. 84) తెలుగున 'సంతరించు'గ ఇది చేరి కొంత అర్థవిస్తృతిని పొంది 'రచించు, నిర్మించు' మొదలగు అర్థములను గ్రహించినది; 'సంతరించితి నిండు జవ్వనంబున యందు హర్ష నైషధ కావ్యమాంధ్ర భాష' (కాశీ. 1. 8)

228. పా. సపత్తి తె. సవతి

**సం.** లోని 'సపత్ని' పా. లో 'సపత్తి'గ కన్పట్టుచున్నది (జా.1.398). తెలుగున 'సవతి'గ పాళీపదము పరిణమించి ఆ అర్థముననే లోకవ్యవహారమునను, కావ్యములందును విరివిగ ప్రయుక్తము, 'సరసంపు మాతల్లి సవతి మేల్బంతి (సారంగ. 1.94)

229. పా. సప్ప తె. సప్పము

**సం.** 'సర్ప'కు వికృతియనదగినది పాళీలోని 'సప్ప' (మ.1.130) తెలుగున పాళీపదము యథాతథముగ ప్రవేశించి ఆ అర్థమునే కలిగియున్నది; 'సప్పంబు పడగ నీడను కప్పవసించిన విధంబు గదరా సుమతీ' (సు.శ.19)

230 పా. సమయ తె. సమయు

పా. లోని 'సమయ' అను విశేష్యమునకు 'తుద, ముగింపు' అను అర్థములు కలవు (అంగు. 3 178). తెలుగున ఇది క్రియగ 'సమయు' అను రూపమును గ్రహించి 'చనిపోవు' అను అర్థమును సంతరించుకొనినది, 'తలపడి సమయజేసెనదియు సమసె నధిప' (భార.భీష్మ. 3.101)

231. పా. సమ్బళ తె. సంబళము

పా. లోని 'సమ్బళ'కు 'చేసినపనికై ఇచ్చెడి ప్రతిఫలము' అని అర్థము. పాళీనుండి యథాతథముగ ఆ అర్థముననే తెలుగులోనికి ఆ పదము వచ్చినది. 'సంబళమ్మనన వేతనమై' (ఆం పదాకరము.నర. 117).

232. పా. సమ్బుక తె. చెంబు

ద్రవపదార్థమును కొనిపోవనుపయోగించు, చిప్పవంటి దానిని పాళీలో 'సమ్బుక' అనిరి (దీఘ. 1.84). తెలుగున ఇది 'చెంబు'గ ఆ అర్థముననే పరిణమించినది 'తామ్రాది కలశాభిధానముల్ చెలువొందు దంబిగ యనఁగను జెంబనంగ' (ఆం. భా. 2.236) ఈ పదము సం. లోని 'శుల్బమ్' కు తద్భవ మని భావించి సూ.రా.ని. పొరపడినది.

233. పా. సమ్భార తె. సంబారు (పొడి)

రుచికై వివిధాహార ద్రవ్యములను కలిపిచేసిన దానిని 'సమ్భార' అని పాళీలో వ్యవహరించిరి (మిళి. 258). సం. న 'సమ్భార' పదము ఉన్నను ఇట్టి అర్థమున ప్రయోగము విరివిగ కనబడదు. పాళీపదమే తెలుగులోనికి చొర బారి 'సంబారు'గ రూపొందినది (ఇది తమిళుల సాంబారు కాదు). తెలుగుదేశపు పల్లెలలో ఈ నాటికిని 'సంబారు పొడి'ని తయారు చేసికొనుట కలదు. కావ్యము లందును ప్రయోగములు కననగుచున్నవి; 'సంబారములతోడి శాకపాకములతోఁ బక్వమైన పెసర పప్పుతోడ' (భీమ. 1.60).

234. పా. సరావ తె. సరవ (చరవ)

సం. లోని 'శరావ' పదమునకు రూప వికృతి యనదగినది పాళీలోని 'సరావ'; గిన్నె, పళ్లెము - అను అర్థములు ప్రయోగములందు సరికుదురు చున్నవి (అంగు. 1.161; జా. 18). తెలుగున 'సరవ' గ ఈ పాళీపదము చేరి. చిన్న బుంగ, బుడ్డి, ఎక్కువలోతుండు పళ్ళెము' అను అర్థములతో లోక వ్యవహారమున వాడుకలో ఉన్నది. కావ్యములందు ప్రయోగములు కన్పడవు.

235. పా. సాతవ తె. చాటువు

పాళిలోని, 'సాతవ'కు 'మంచిమాటల పొందికతో సాధించునది' అని అర్థము (జా. 6 235) తెలుగున ఇది 'చాటువ'గ లోక వ్యవహారమునను, కావ్యములందును కననగుచున్నది లోక వ్యవహారములో ఒక నీతిని బోధించ వలసినప్పుడు 'దీనికి ఒక చాటువ చెప్పెదను' అని పెద్దలు ఏదియో ఒక ఉదంతమును చెప్పుట పరిపాటి. ఆ సందర్భమున పాళిలోని అర్థము చక్కగ సరికుదురును. కాని కావ్యములందు 'చాటువ' అనగా 'ప్రసిద్ధి' అను విస్తృతార్థము కలిగినది; 'చాటువ కెక్కినట్టి నెఱజాణతనంబున వాగ్విలాసితన్' '(విక్ర. 8.104) **సం.** లోని 'చాటు' పదము పా. లోని 'సాతవ' నుండియే రూపొంది యుండవచ్చును. 'సాతవ' అనునది **సం.** లోని 'సాధు'కు సన్నిహితమగునేమో యని ఒక నిఘంటుకారుడు శంకించెను.

236. పా. సుక్క తె. చుక్క

పా. లోని 'సుక్క' కు 'నక్షత్రము' అని అర్థము (ఉ. 9). **సం.** లోని 'శుక్ర'తో దీనికి సంబంధము ఉండునని ఒక పండితుని అభిప్రాయము. కాని 'శుక్ర'కు నక్షత్రమను సామాన్యార్థము **సం.** లో కన్పట్టదు. పాళీ పదము తెలుగున 'చుక్క'గ ఆ అర్థముననె చేరినది; 'చుక్కలు తోడు తోడఁ దలచూపఁ దొడంగె' (భార : విరా. 2. 319). తెలుగున ఈ అర్థమే గాక 'చుక్క' యన శుక్రగ్రహమనికూడ అర్థమున్నది. 'చుక్క యొకింత నిక్కి బలసూదను దిక్కున రాయుచుండుటన్' (క్రీడా. 51). పా. లోని 'చుక్క'కు గ్రహము అను అర్థమును కలదు. అది శుక్రగ్రహముననే వర్తించి, తెలుగులోనికి వచ్చియుండును.

237. పా. సుఙ్క తె. సుంకము

**సం.** లోని 'శుల్క'యే పా. లో 'సుఙ్క' గ వ్యవహృతము (విన. 3. 52) తెలుగులోనికి ఆ పాళీపదము దాదాపుగ యథాతథముగ 'సుంక' గ ఆ అర్థముననే చేరినది; 'సుంకమన దాణమనగను శుల్కమెసగు' (ఆం.భా. 2.19).

238. పా. సుత్తి తె. సుద్ది

'సుత్తి' అను పాళీ పదమునకు 'మంచిమాట' అని అర్థము (సద్ద. 340) **సం.** లోని 'సూక్తి'కి ఇది పాళీభాషా రూపము. 'సుత్తి' తెలుగున 'సుద్ది'గ అదే అర్థమున పరిణమించినది; 'సుధలొల్కు తియ్యని సుద్దులవాని' (రం. రా. అయోధ్యా. పు. 94)

**239.** పా. సున్న తె. సున్న

**సం.** లోని 'శూన్య' అనునదియే పా.లో 'సున్న'గ కన్పట్టుచున్నది. (**మిళి.** 5) తెలుగున ఆ పాళీపదము యథాతథముగ ఆ అర్థముననే ప్రవేశించినది 'ఎవ్వనిం జూచిన నల్ప మానవుఁడు సున్న తదీయ సదస్యనోటిలోన్' (విక్ర. 5. 126)

